
PARLE
Parle-G

## చరిత్ర సృష్టించిన స్వాతి దశాబ్ది

తెలుగు పత్రిక పుట్టిననాటినుండి
ఇంతవరకూ ఏ వారపత్రికా అధిరోహించని
సమున్నత సువర్ణ శిఖరం

# 2,60,000 కాపీల సర్క్యులేషన్



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక స్వాతి

## రెండు లక్షల అరవై వేల కాపీల సర్క్యులేషన్‌ను సాధించింది

ఎవరన్నారు- తెలుగువారు పత్రికల్ని కొని చదవరని?

*అది అపోహ మాత్రమేనని రుజువుచేస్తోంది స్వాతి సపరివార పత్రిక దిగ్విజయం!*

- ☆ 1984లో శ్రీకారం చుట్టుకున్న స్వాతి సపరివార పత్రిక, 1989లో 'ఇండియన్ మార్కెట్ రీసెర్చ్ బ్యూరో' (IMRB) నిర్వహించిన సర్వేలో- 'ది బెస్ట్ వీక్లీ ఆఫ్ ది తెలుగు రీడర్స్'గా మకుటధారణ చేసింది.
- ☆ 1991లో లక్షకాపీల సర్క్యులేషన్‌ను అధిగమించి, 'ఆడిట్ బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్' (ABC) ద్వారా "అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక"గా అగ్రస్థానంలో నిలిచింది.
- ☆ స్వాతి సర్క్యులేషన్ గ్రాఫ్ ఎక్కడా తలవంచకుండా, మెరుపువేగంతో పైపైకి పాకుతూ, ఇప్పుడు రెండులక్షల అరవైవేల కాపీలకు చేరుకుని, ఇంకా ఇంకా ముందుకు దూసుకువెళ్తోంది.
- ☆ స్వాతి నిర్వహించిన సర్వే ప్రకారం- స్వాతి సపరివార పత్రిక ఒక్కో కాపీని సగటున 8.42 మంది పాఠకులు చదువుతున్నారు. ఆ లెక్కన వారం వారం ఇరవై ఒక్కలక్షల ఎనభై తొమ్మిదివేల రెండు వందలమంది పాఠకులు చదువుతున్న ఏకైక పత్రిక స్వాతి సపరివార పత్రిక.
- ☆ విస్తారమైన పాఠక సామ్రాజ్యానికి గుర్తింపుగా, ప్రధాని పి.వి. నరసింహారావు గారితో విదేశీ పర్యటనలకు ఇప్పటికి మూడుమార్లు ప్రత్యేక ఆహ్వానం పొందింది.

*ఈ వర పరంపర పాఠకదేవుళ్లు అనుగ్రహించిన రత్నాక్షతలే!*

*ఈ అఖండాదరణని సద్వినియోగం చేసుకుంటూ, ఇతోధిక సాధనకి సమాయత్తమవుతూ, రెండో దశాబ్దాన్ని మహోత్సాహంతో ఆహ్వానిస్తున్నాం.*

*ఈ చారిత్రక దిగ్విజయ మహోత్సవానికి కారకులైన పాఠకదేవుళ్లకు, రచయిత(త్రు)లకు, చిత్రకారులకు, ప్రకటనకర్తలకు, ఏజెంట్లకు, శ్రేయోభిలాషులకు కృతజ్ఞతా మణిహారాలు! వందనాల శ్రీచందనాలు!*

స్వాతిలో పాఠకుల
హృదయం వుంది.
పాఠకుల హృదయంలో
స్వాతి వుంది.

నేటి మేటి
పాఠకులకు
దీటైన పత్రిక
స్వాతి సపరివార పత్రిక

**ఈ పదేళ్ళ పండుగ సందర్భంగా**
**స్వాతి సపరివార పత్రిక దశాబ్ది సంచిక మార్కెట్లో సిద్ధంగా వుంది.**



# చందమామ

అగస్టు 1994



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు





విడి ప్రతి : **4.00**

సంవత్సర చందా : **48.00**

ఈ చిత్రం విజయోత్సవానికి కారకులైన నటీనటులకూ, సాంకేతిక నిపుణులకూ, డిస్ట్రిబ్యూటర్లకూ, థియేటర్ల వారికీ- ఆదరించిన అఖిలాంధ్ర ప్రేక్షకులకూ మా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాము.

# 100

చందమామ
విజయా కంబైన్స్

# భైరవ ద్వీపం

బి.వెంకట్రామరెడ్డి సింగీతం శ్రీనివాసరావు

రావి కొండలరావు మాధవపెద్ది సురేష్ కబీర్ లాల్ రాజగోపాల్ పేకేటి రంగా సుందరం విక్రమ్ ధర్మా
విజయా-వాహిని





# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి


## పోటీ కాదు, సహకారం!



మన విశ్వవిద్యాలయాలు కొంతకాలం క్రితం వరకు డాక్టరేట్లు అంటే పి.హెచ్.డీలు, డి.ఎస్సీలు మొదలైన పట్టాలు సాధించిన వారి పేర్లను మాత్రమే పత్రికలలో ప్రకటించేవి. పరిశోధన, కృషి, పట్టుదల ఉంటే తప్ప అటువంటి పట్టాలు పొందడం సాధ్యం కాదు. కాబట్టి దానినొక గొప్ప విశేషంగా ప్రకటించే వారు. పరీక్షలలో ఉత్తీర్ణులయిన మిగతా వారి నెంబర్లు మాత్రం పత్రికలలో ప్రకటించేవారు.

మరి ఇవాళ జరుగుతున్నదేమిటి? పాఠశాల పరీక్షా ఫలితాలతో పాటు పరీక్షలలో ర్యాంకులు సాధించిన వారి పేర్లు, ఫోటోలు, వాళ్ళ ఇంటర్వ్యూలతో సహా పత్రికలలో ప్రచురితమవుతున్నాయి. కొన్ని పాఠశాలలు కూడా తమ బడులలో చదివి ర్యాంకులు తెచ్చుకున్న విద్యార్థుల వివరాలను ప్రకటిస్తున్నాయి. సాంకేతిక వృత్తి విద్యాకేంద్రాలలో చేరడానికి ప్రవేశ పరీక్షలలో ఉత్తీర్ణులయిన వారి ఫోటోలు కూడా ఆయా శిక్షణాసంస్థలు ప్రచురిస్తున్నాయి.



ఇవన్నీ ఆయా శిక్షణాసంస్థల పరపతిని పెంచుతాయనడంలో సందేహం లేదు. అయితే, ఇది విద్యార్థులలో ఆరోగ్యకరమైన పోటీ మనస్తత్వాన్ని పెంచుతుందా అన్నది ఆలోచించవలసిన విషయం. విద్యార్థులలో పోటీమనస్తత్వం కొంతవరకు అవసరమే కాని, అది హద్దు దాటడం మంచిది కాదు. దాటితే విద్యార్థులలో వైషమ్యాలకూ, విరక్తికీ దారి తీస్తుంది. మన విద్యావిధానం విద్యార్థులలో పోటీ మనస్తత్వం కన్నా, సహకార భావాన్ని పెంపొందించేదిగా ఉండాలని విద్యావేత్తలు కొందరు అభిప్రాయపడడంలోని ఆంతర్యం ఇదే!


సంపుటి : 96 ఆగస్టు '94 సంచిక: 2

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00




మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకు పైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, యిటు పరిశ్రమలోనూ,
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న

ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర






వార్తలు-విశేషాలు :

# సోదరుల మధ్య యుద్ధం

"**సో**దరుల మధ్య పోరాటం!" అనే పతాక శీర్షికలతో కొన్ని వార్తాపత్రికలు ఎమెన్ అంతర్యుద్ధం గురించిన వార్తలను వెలువరించాయి. అల్జీరియా మాజీ విదేశాంగ మంత్రి లఖ్దర్ ఇబ్రహీం, ఐక్యరాజ్య సమితి ప్రత్యేక రాయబారిగా ఎమెన్ వెళ్ళి 'సోదర హత్యలను' ఆపమని అభ్యర్థించాడు.

ఉత్తర, దక్షిణ ఎమెన్ ప్రజలనే ఆ పత్రికలు సోదరులుగా పేర్కొన్నాయి. నాలుగేళ్ళ క్రితం ఏకమైన ఉత్తర, దక్షిణ ఎమెన్‌ల మధ్య మళ్ళీ యుద్ధం ఎందుకు ఆరంభమయింది? మే నెలలో సమైక్య ఎమెన్ నుంచి, దక్షిణ ఎమెన్ విడిపోయి స్వతంత్ర దేశంగా ప్రకటించుకోవడంతో ఇరుసేనల మధ్య యుద్ధం ఆరంభమయింది. దాదాపు నూరు రోజులు జరిగిన ఈ యుద్ధంలో పలువురు ప్రాణాలు కోల్పోయారు.

సమైక్య ఎమెన్ ఏర్పడినప్పుడు ఉత్తర ఎమెన్‌కు చెందిన 'పీపుల్స్ జనరల్ కాంగ్రెస్' నాయకుడు అలీ అబ్దుల్లా సాలే యూనియన్ ప్రెసిడెంట్ అయ్యాడు. దక్షిణ ఎమెన్‌కు చెందిన 'ఎమెనీ సోషలిస్టు పార్టీ' నాయకుడు అలీ సలీం అల్‌బీద్, వైస్‌ప్రెసిడెంట్ అయ్యాడు. యూనియన్ ఏర్పడడానికి పూర్వం ఉత్తర ఎమెన్ సంప్రదాయ ఇస్లాం మత ఆధిపత్యం కింద ఉండేది. దక్షిణ ఎమెన్‌కు నాటి సోవియట్ యూనియన్ సహాయ సహకారాలు లభించడంతో సోషలిస్టు దేశంగా ఉండేది. పరస్పర విరుద్ధమైన రాజకీయ అభిప్రాయాలు కలిగిన రెండు దేశాలమధ్య సమైక్యత ఎంతోకాలం కొనసాగదని అప్పుడే రాజకీయ పరిశీలకులు భావించారు. అయితే, దేశంలో ఆర్థిక అభివృద్ధిని సాధించడానికి ఉభయులూ సర్దుకు పోగలరని కూడా ఆశించారు.

1993వ సం॥లో మొట్టమొదటి సాధారణ ఎన్నికలు జరిగాయి. 301 సభ్యులు గల శాసన సభలో సాలే నాయకుడుగా వున్న పీపుల్స్ జనరల్ కాంగ్రెస్ పార్టీ 121 స్థానాలను గెలుచుకున్నది. సోషలిస్టు పార్టీకి 56 స్థానాలు



మాత్రమే లభించాయి. 'ఎమెనీ గ్యాథరింగ్ ఫర్ రిఫార్మ్' అనే పార్టీ, సోషలిస్టుపార్టీ కన్నా ఎక్కువ స్థానాలు గెలుపొంది, పీపుల్స్ జనరల్‌కాంగ్రెస్‌తో చేతులుకలపడంతో, సాలే అధ్యక్షుడుగా నూతన ప్రభుత్వం ఏర్పడింది. అయితే, ఈ ప్రభుత్వం ఎమెన్ యూనియన్ సమైక్యతను కాపాడలేకపోయింది. ప్రెసిడెంట్ సాలే దక్షిణ ఎమెన్ నూనె గనుల మీద అధికారం పొందడానికి ప్రయత్నించడం, ఉభయ ప్రాంతాల సైనికుల మధ్య ఘర్షణలకు దారితీసింది.

మే 5వ తేదీ ఉత్తర ఎమెన్, దక్షిణ ఎమెన్ యుద్ధవిమానాన్ని పడగొట్టింది. దక్షిణ ఎమెన్, తన వైమానిక దళం మీద దాడి జరిపినట్టు ఉత్తర ఎమెన్ నిందారోపణ చేసింది. ప్రెసిడెంట్ సాలే అత్యవసర పరిస్థితిని ప్రకటించాడు. అలీ సలీం అల్‌బీద్‌ను వైస్‌ప్రెసిడెంట్ పదవి నుంచి తొలగించాడు. రక్షణ, నూనె శాఖల మంత్రులను కూడా తొలగించాడు. దక్షిణ ఎమెన్‌లో కీలకస్థానమైన ఏడెన్ గవర్నర్‌ను మార్చాడు.

సంఖ్యాబలంలో ఎక్కువగా వున్న ఉత్తర ఎమెన్ సేనలు దక్షిణ ఎమెన్‌కేసి నడిచాయి. దక్షిణ ఎమెన్ 'స్కడ్స్' వంటి ఆధునిక యుద్ధ ఆయుధాలను ఉత్తర ఎమెన్ మీదికి ప్రయోగించింది. దక్షిణ ఎమెన్ యూనియన్ నుంచి విడిపోయి, స్వతంత్రం ప్రకటించుకున్నది. ప్రెసిడెంట్ సాలే ప్రభుత్వాన్ని గుర్తించే పక్షంలో ఉత్తర ఎమెన్ యుద్ధ విరమణకు సంసిద్ధతను తెలియజేసింది. సమైక్య ఎమెన్ కొనసాగడానికి దక్షిణ ఎమెన్ ఏడు నిబంధనలను పెట్టింది. సాలే వాటిని తిరస్కరించాడు.

మూడు నెలల పాటు అంతర్యుద్ధం కొనసాగింది. ఈ మూడు నెలల కాలంలో ఆరుసార్లు ఉభయ పక్షాలూ యుద్ధవిరమణకు అంగీకరించాయి. కాని కొన్ని గంటలలోనే శాంతి షరతులను ఉల్లంఘించారని ఒకరి నొకరు విమర్శించుకుంటూ యుద్ధానికి దిగారు.

ఏడెన్ పతనంతో అలీ సలీం అల్‌బీద్, మరికొందరు దక్షిణ ఎమెన్ నాయకులు పొరుగు దేశమైన ఓమన్‌కు పారిపోయారు. పొరుగు దేశంలో ఆశ్రయం పొంది వున్నప్పటికీ దక్షిణ ఎమెన్ నాయకులు ఎంతోకాలం ఊరుకోరని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. అయితే, ఉత్తర ఎమెన్ యుద్ధ చర్యలను పూర్తిగా విరమించినట్టూ, ప్రజాస్వామ్య ఉద్ధరణకు త్వరలో బహుళ రాజకీయ పక్షాల ఎన్నికలు జరపడానికి సిద్ధంగా ఉన్నట్టూ ప్రకటించింది.

ఎమెన్‌లో మునుముందు ఏమవుతుందో చెప్పలేని పరిస్థితి నెలకొని ఉన్నది.

## ఎమెన్ పుట్టు పూర్వోత్తరాలు

సుగంధ ద్రవ్యాలకు ప్రపంచ ప్రసిద్ధి గాంచిన ప్రాచీన దేశం ఎమెన్. 16వ శతాబ్దంలో అది ఓటమన్ టర్కుల సామ్రాజ్యంలో ఒక భాగంగా ఉండేది. సుల్తానుల నుంచి ఏడెన్‌ను 1839వ సం॥లో బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆక్రమించింది. ఏడెన్ కీలకమైన స్థానం కావడంవల్ల ఓడ మార్గాల మీద బ్రిటిష్ వారికి అజమాయిషీ పెరిగింది. మొదటి ప్రపంచ యుద్ధంలో టర్కులు ఓడిపోవడంతో మిగతా రాజ్యాలతో పాటు ఎమెన్ తమ దేశాన్ని 'అరబ్ రిపబ్లిక్ ఆఫ్ ఎమెన్'గా ప్రకటంచుకున్నది. మరుసటి సంవత్సరం ఏడెన్, మరికొన్ని ప్రాంతాలు కలిసి 'ఫెడరేషన్ ఆఫ్ సౌత్ అరేబియా'ను ఏర్పాటు చేసుకుని బ్రిటిష్ సేనలను అక్కడి నుంచి ఉపసంహరించుకోమని కోరాయి. 1967వ సం॥లో బ్రిటిష్ సేనలు ఏడెన్ నుంచి తిరిగి వెళ్ళాయి. ఆ తరవాత 'పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ సదర్న్ ఎమెన్' ఏర్పడింది. 1970వ సం॥లో పాలక మార్క్సిస్ట్ పార్టీ దానికి, 'పీపుల్స్ డెమొక్రటిక్ రిపబ్లిక్ ఆఫ్ ఎమెన్' అని పేరు పెట్టింది. మరుసటి సంవత్సరం ఉభయ ఎమెన్‌ల మధ్య యుద్ధం ప్రారంభమై ఒక సంవత్సరం సాగింది. 1979వ సం॥లో సంధి, ఒడంబడికలు ఏర్పడ్డాయి. సమైక్య ఎమెన్ ఏర్పాటుకు చర్చలు ప్రారంభమై సంయుక్త 'ఎమెన్ కౌన్సిల్' రూపొంది, ఆ పిమ్మట సనా రాజధానిగా 'రిపబ్లిక్ ఆఫ్ ఎమెన్' ఏర్పడింది.



# భూతాలు చేసిన పెళ్ళి

కనగానిపల్లెలోని కమలాకరుడికి, పట్నం లోని కచ్చేరీలో ఉద్యోగం. అతడు రోజూ అడవిదారి వెంట పట్నానికి వెళ్ళి సాయం కాలానికి తిరిగి వస్తూండేవాడు. చిన్నతనం లోనే తండ్రిని పోగొట్టుకున్న అతణ్ణి, తల్లి అష్టకష్టాలూ పడి పెంచి పెద్ద చేసింది.

కమలాకరుడిది చాలా శ్రావ్యమైన కంఠ స్వరం. ఒకరోజు రాత్రి అతడు, తల్లి అడిగిన మీదట ఏదో పాట పాడుతూండగా, ఆమె కళ్ళు మూసుకుని మరి తెరవలేదు. దానితో కమలాకరుడు ఒంటరివాడైపోయాడు.

అతడు రోజూ వంట చేసుకునేందుకు పడుతున్న ఇబ్బంది చూసి, అతడి స్నేహితులు, "ఎన్నాళ్ళిలా వంట పనులతో తంటాలు పడ తావు? నీకు నచ్చిన పిల్లను చూసి పెళ్ళి చేసుకోరాదూ?" అని సలహా ఇచ్చారు.

పెళ్ళి మాట వినగానే అతని కళ్ళముందు పొరుగింటి పార్వతి మెదిలింది. పార్వతి తండ్రి ఒక చిన్న వ్యాపారి. పార్వతి ఒక్కతే ఆయన సంతానం. ఆమె మంచి అందగత్తె. ఆమె రోజూ సాయంత్రం ఊరి చివర వున్న దేవీ ఆలయానికి వెళ్ళి వస్తూంటుంది. వెళ్ళే ముందు, కమలాకరుడి ఇంటి ముందున్న పూలతోటలోంచి పూలు కోసుకుని వెళుతూం డేది. ఆశ్చర్యం కలిగించే సంగతేమంటే— ఏనాడూ కమలాకరుడు ఆమెను పలకరించి ఎరగడు.

ఒకనాటి సాయంకాలం అతడు కచ్చేరీ నుంచి ఇంటికి తిరిగివస్తూనే, ఏదో తెచ్చు కున్న మొండిధైర్యంతో, పూలు కోసుకుం టున్న పార్వతిని సమీపించి, "నువ్వంటే నాకు ఇష్టం. నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకుం టున్నాను. నీ అభిప్రాయం ఏమిటి?" అని సూటిగా అడిగేశాడు.

దానికి పార్వతి ఒక క్షణం నివ్వెరపోయి, "నువ్వు చక్కగా పాడగలవేమోగాని, కత్తి దూసి

మాచిరాజు కామేశ్వరరావు




సాహసాలు చేయగలవా? తల వంచుకుని అలా దారివెంట పోతూంటే, నలుగురూ నిన్ను బుద్ధిమంతుడని పొగడవచ్చు గానీ, పదిమందిలో గర్వంగా తల ఎత్తుకుని నిలబడగల ఆర్థికస్థోమత నీకుందా? నీకు కళ్ళూ, ముక్కూ వుండొచ్చు కానీ, అవి తీర్చిదిద్దినట్లు వున్నాయో లేవో ఏనాడైనా అద్దంలో చూసుకున్నావా? ఇకపై ఎన్నడూ నావద్ద ఇటువంటి అవివేకపు ప్రస్తావన తీసుకురావద్దు!" అన్నది కోపంగా.

కమలాకరుడు ఏదో చెప్పబోయేసరికి ఆమె వినిపించుకోకుండా, కోసిన పువ్వులు నేలకేసి కొట్టి విసవిసా తన ఇంట్లోకి వెళ్ళిపోయింది.

కమలాకరుడికి అవమానంతో తల తీసేసినట్లయింది. జీవితం అంటే విరక్తి పుట్టింది. ఆసరికి చీకటి పడినా, అతడు ఇంట్లో దీపం కూడా పెట్టకుండా అడవికేసి నడిచాడు.

అడవి అంతా పుచ్చపువ్వులాంటి వెన్నెలతో వెలిగిపోతున్నది. కమలాకరుడు దిగులుగా ఒక బండరాయి మీద కూర్చుని, తల్లి గుర్తుకురాగా, ఆమె తరచుగా మెచ్చుకునే పాట ఒకటి పాడసాగాడు.

కొంతసేపటికి అతడు పాడటం ముగించేసరికి, అడవి చెట్ల లోంచి, "అద్భుతమైన పాట! రాగం ఏమిటో తెలియడం లేదుగాని అమోఘంగా వుంది!" అంటూ, అప్పటివరకూ కమలాకరుడి పాట విన్న మూడు భూతాలు చప్పట్లు చరుస్తూ అతడి దగ్గరకు వచ్చినై.

జీవితం అంటే విరక్తి చెందివున్న కమలాకరుడు, భూతాలను చూసి ఏమాత్రం భయపడలేదు. అవి అతడి చుట్టూ చేరి, "పాట బావున్నా అదేదో విషాదగీతంలా వుంది. ఏదైనా ప్రమోద గీతం పాడి మమ్మల్ని మరి కాస్త ఆనందపరుచు," అని కోరాయి.

"ఇక నా జీవితంలో ప్రమోదమన్నదే లేదు. విషాద గీతాలు తప్ప, నా గళం దేన్నీ పలకలేదు," అన్నాడు కమలాకరుడు నిట్టూర్పుతూ.

"ఇంత లేతవయసు కుర్రాడివి! అప్పుడే విషాదంఏమిటి? కాస్త వివరంగా చెప్పు," అని అడిగాయి భూతాలు. కమలాకరుడు, పార్వతి తనను అవమానించిన సంగతి వాటికి చెప్పాడు.

అప్పుడు భూతాలు తమలో తాము కూడబలుక్కుని, "ఆ పార్వతిపిల్ల పొగరుబోతులా

వుంది. సరే నీ పెళ్ళి సంగతి మేం చూస్తాం! నువ్వు మాత్రం ఇటు నుంచి ఇటే పట్నం వెళ్ళిపో. మళ్ళీ పున్నమి రాత్రికి ఇక్కడికిరా," అని కమలాకరుడికి చెప్పాయి.

భూతాలమాటలలోవిశ్వాసంలేకపోయినా, తిరిగి ఇంటికి వెళ్ళడం ఇష్టంలేక కమలాకరుడు పట్నం వెళ్ళిపోయాడు.

ఆ మర్నాటి సాయంత్రం పార్వతి, దేవీ ఆలయానికి వెళ్ళి తిరిగి వస్తూండగా బాగా చీకటి పడింది. ఆమె అంతటా గుబురు పొదలున్న కాలిబాట వెంట నడుస్తూండగా, ఒక కుందేలును తరుముతూ చిరుతపులి ఒకటి ఆమె దారికి అడ్డం వచ్చింది. కుందేలు పొదల మాటుకు పారిపోగానే చిరుత భయంకరంగా అరిచి పార్వతి మీదికి దూకబోయింది.

పార్వతి కెవ్వున కేక పెట్టి కళ్ళు మూసుకున్నది. అయితే, ఎంతసేపటికీ చిరుత ఆమె మీదికి రాకపోవడంతో, పార్వతి కళ్ళు తెరిచి అక్కడ కనబడిన దృశ్యం చూసి అమితాశ్చర్యం చెందింది.

కమలాకరుడు తళతళ మెరుస్తున్న కత్తిని ఒరలో పెడుతున్నాడు. సగం తల తెగిన చిరుతపులి, అతడి కాళ్ళ ముందు గిల గిలా తన్నుకుంటున్నది.

ఆ సమయంలో పార్వతి కళ్ళకు కమలాకరుడు యోధానయోధుడుగా కనిపించాడు. ఆమె అతడికి కృతజ్ఞతలు చెప్పాలనుకుని, ఒక అడుగు ముందుకు వేసేంతలో, ఆ అవకాశం ఇవ్వడం ఇష్టంలేనట్టుగా అతడు చీకట్లో కలిసిపోయాడు.





పార్వతి బరువుగా నిట్టూర్చి ఇంటి దారి పట్టింది. ఆమె అలా వెళ్ళగానే కుందేలు, చిరుత, కమలాకరుడి రూపాలలో వున్న భూతాలు తమ అసలు రూపాలు ధరించి, తమ మొదటి ప్రయత్నం సఫలం అయినందుకు పెద్దగా నవ్వుకున్నాయి.

మర్నాడు, పార్వతి దేవీఆలయం నుంచి తిరిగివస్తూ, దారికి కొంచెం పెడగా కొత్తగా కట్టిన పెద్దభవనం చూసి ఆశ్చర్యపోయింది. ఇంతలో కమలాకరుడు భవనం నుంచి బయటికి వచ్చి, ఆవరణలో నిలబడి వున్న నౌకర్లకు ఏదోచెప్పి లోపలికివెళ్ళిపోయాడు. ఇది చూసి పార్వతి ఎక్కడలేని ఆశ్చర్యంతో నౌకర్లను సమీపించి, "ఈ భవనం ఎవరిది?" అని అడిగింది.

"కమలాకరుడు గారిది! ఊళ్ళో వున్న పాత ఇంట్లో వుండడం ఆయనకు ఇష్టంలేక, ఈ భవనం కట్టించారు," అని జవాబిచ్చారు నౌకర్లు.

"ఒక్క రోజులో ఇంత భవనం కట్టడం ఎలా సాధ్యమైంది?" అంటూ విభ్రాంతితో అడిగింది పార్వతి.

"కమలాకరుడి గారి శక్తియుక్తులు ఎరిగున్న వాళ్ళు, ఇలాంటి పిచ్చి ప్రశ్నలు అడగరు!" అంటూ నౌకర్లు విసుగ్గా భవనంలోకి వెళ్ళిపోయారు.

"ఏమిటి, అంతా అయోమయంగా వున్నది!" అనుకుంటూ పార్వతి ఇంటిదారి పట్టి కొంత దూరం పోగానే, భవనం అదృశ్యమయింది. కమలాకరుడు, నౌకర్లు భూతాలుగా మారి తమ రెండో ప్రయత్నం కూడా విజయవంతమైనందుకు నవ్వుతూ గెంతులు వేశాయి.

పార్వతి ఆ రాత్రంతా కమలాకరుడి ధైర్య సాహసాలు, అతడి సంపద గురించి ఆలోచిస్తూ నిద్ర లేకుండా గడిపింది.

మర్నాడు మనసేమీ బాగుండక పార్వతి, దేవీఆలయానికి వెళ్ళలేదు. చీకటి పడుతూండగా ఆమె కమలాకరుడి ఇంటి ముందున్న పూలతోటలోకి వెళ్ళేసరికి, కళ్ళు చెదిరిపోయే అందగత్తెల రూపాల్లో మూడు భూతాలూ అక్కడికి వచ్చాయి.

వాళ్ళను చూసి పార్వతి అబ్బురపడుతూ, "ఎవరు మీరు?" అని అడిగింది.

"మేం ముగ్గురం స్నేహితురాళ్ళం! ముగ్గురం కచ్చేరీలో పనిచేసే కమలాకరుణ్ణి గాఢంగా ప్రేమించాం. ఆయన మాలో ఎవరిని ఇష్ట పడితే, వాళ్ళను పెళ్ళిచేసుకోమని ప్రాధేయ పడడానికి వచ్చాం. ఇంతకూ, ఈ ఇల్లు కమలా కరుడిదేనా?"అని అడిగాయి భూతాలు.

"ఇల్లు ఆయనదేగానీ ప్రస్తుతం ఆయన ఇంట్లో లేరు. నాదొక అనుమానం — ఇంతటి అద్భుత సౌందర్యరాశులైన మీరు, అతి సామా న్యంగా వుండే కమలాకరుణ్ణి ఎలా ప్రేమిం చారు?" అని భూతాలను అడిగింది పార్వతి, ఆశ్చర్యంగా.

ఇందుకు భూతాల్లో ఒకటి ఫక్కుమని నవ్వి, "నువ్వెక్కడి వెర్రిబాగుల దానివి! కేవలం అందంగురించిఆలోచిస్తున్నావా?అందగాడని లక్షలు కట్నంపోసి, మాఅక్క తెచ్చుకున్న బావ ఏమయ్యాడు? ఎక్కిన బండి బోల్తా కొట్టి..."

పక్కనున్న భూతం మాట మధ్యలోనే దాని నోరు మూసి, "ఆ వివరాలన్నీ ఇప్పుడెందుకు? నా స్నేహితురాలు సుకుమారి సంగతేమిటి! అది నవమన్మథుడని కోరి చేసుకున్న జమీం దారుగారి అబ్బాయికి లేని వ్యసనం లేదు. అతగాడు దాన్ని రాచిరంపాన పెడుతున్నాడు. ఇంకా....."

ఈసారి మూడో భూతం దాని నోరు నొక్కి, "ఈ చీకటి వేళ ఆ దుష్టుడి పేరెత్తకు! మా పెద్దమ్మ మూడో మనవరాలికి పట్టిన గతేమిటి! ఆరడుగులమూడంగుళాలఆజానుబాహువు, గరుడనాశిక, కోరమీసాల వాడని — ఆ కుక్కు టేశ్వరం వెంటబడి తాళికట్టించుకుంటే, వాడు



దాన్ని దాసీదానికన్న హీనంగా చూస్తున్నాడు. పైగా....."

ఈసారి పార్వతి విసుగ్గా దాని మాటకు అడ్డొచ్చి, "ఇంతకూ మీరు చెప్పదలుచుకున్న దేమిటి? కమలాకరుడు గొప్ప అందగాడు కాకపోయినా, ఎంతో ఉత్తముడనే గదా? సరే, మీరు చాలా ఆలస్యంగా వచ్చారు. కమలా కరుడికి పెళ్ళి కుదిరిపోయింది!" అన్నది.

"ఎవరితో?" అంటూ ఏకకంఠంగా అడిగాయి భూతాలు.

"నాతోనే! ఇక మీరు వచ్చిన దారే వెళ్ళొచ్చు," అంటూ పార్వతి విసురుగా తమ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

తాము కోరుకున్న విధంగా, పార్వతి మనసు మార్చి, ఆమెను కమలాకరుడితో పెళ్ళికి సుముఖం చేసినందుకు పరమానందం చెంది, భూతాలు మూడూ గుడ్లగూబలుగా మారి కీచుమని అరుస్తూ అడవికేసి ఎగిరిపోయాయి.

మళ్ళీ పున్నమి నాటి రాత్రికి, భూతాలు మూడూ తాము మొదట అడవిలో కమలా కరుణ్ణి కలుసుకున్న బండరాయి దగ్గరకువచ్చి, అతడితో పాటు పార్వతి కూడా వుండడం చూసి కంగారుపడ్డాయి. తాము ఆడిన కపట నాటకమంతా తెలుసుకుని, పార్వతి తమను తిట్టిపోయడానికి వచ్చిందేమో అని భయ పడినై.

ఇది గమనించిన పార్వతి చిరునవ్వు నవ్వుతూ వాటితో, "నాలోని అహంకారాన్నీ, అవివేకాన్నీ తొలగించి, నేను రాయిగా భావించి తృణీకరించినది రత్నమని తెలియజేసిన మీకు కృతజ్ఞతలు చెప్పుకునేందుకు స్వయంగా వచ్చాను," అన్నది.

ఆ జవాబుతో భూతాలు స్థిమితపడి, "ఇంత మంచిపని, ఇంత త్వరగా చేయగలగడం, మాకు చాలా సంతోషం కలిగిస్తున్నది. ఏదీ, మీ నవదంపతులు ఒక చక్కని పాటపాడి మాకు మరింత సంతోషం కలిగించండి!" అని కోరాయి.

వెంటనే కమలాకరుడు, పార్వతిగొంతెత్తి శ్రావ్యంగా ఒక పాట పాడడం ప్రారంభించారు. భూతాలు మూడూ ఎక్కడలేని ఆనందంతో చప్పట్లు చరుస్తూ, నాట్యం చేయసాగాయి.





# కీర్తిసింహుడ కథ

## 4

[జయవర్మ, జయసేనుడు ఇచ్చిన తన తండ్రి ఉత్తరం చదివాడు. ఆ ఉత్తరంలో, అపూర్వహారం ఉన్న చోటు నిగూఢంగా వివరించబడింది. అది జయవర్మకు అంతుబట్టలేదు. అలా ఐదు తరాలు గడిచిపోయాయి. ఇప్పటి రాజు సుషేణుడు, మహిమగలహారం తన కుమారుడు కీర్తిసింహుడికి లభించాలని ఆశించాడు. అందుకే జయసేనుడి కుమార్తె తెలివితేటలను ఉపయోగించుకోవాలనుకున్నాడు. అదేసమయంలో కాంభోజరాజు గరుడదత్తుడు — నగదేశపు రాజు నాగాకర్ణుడితోనూ, చాక్యదేశపు రాజు కుండినవర్మతోనూ కలిసి, అపూర్వహారంతో పాటు కోసల రాజ్యాన్ని కూడా కబళించడానికి కుట్రపన్నాడు. గురుకులం నుంచి తిరిగి వస్తూన్న కీర్తిసింహుణ్ణి బంధించి అపహరించడానికి ముగ్గురూ కలిసి పథకం వేశారు. — తరవాత]

ఇక్కడ కోసలలో శక్తిసేన బయలుదేరనున్న సమయంలోనే, గరుడదత్తుడూ అతడిమిత్రులూ పంపిన ముగ్గురు భటులూ అరణ్యం కేసి బయలుదేరారు.

ఇలా, ఒకరికితెలియకుండా మరొకరు తన కోసమే బయలుదేరి వస్తున్నారన్నవిషయం తెలియని కీర్తిసింహుడు, అక్కడ కృష్ణచంద్రుడి గురుకులంలో విద్య పూర్తి చేసుకుని, స్వదేశానికి ప్రయాణమయ్యే ఉత్సాహంలో వున్నాడు.

అతడు ఎదురు చూస్తున్న కృష్ణ పాడ్యమి రానే వచ్చింది. నాటి తెల్లవారు జామునే లేచి గురువు కృష్ణచంద్రుడి ఆశీస్సులు పొంది, మిత్రుల దగ్గర వీడ్కోలు తీసుకుని, నిర్ణయించబడిన ముహూర్తానికి, తన ఉత్తమాశ్వం భానుమతిని అధిరోహించి బయలుదేరాడు, కీర్తిసింహుడు.

జాము పొద్దెక్కే వేళకు అతడు, ఆరావళీ పర్వత ప్రాంతాల వున్న అడవి మధ్య భాగానికి

లక్ష్మీగాయత్రి



కీర్తిసింహుడికి ఆశ్చర్యాన్నీ, అనుమానాన్నీ కలిగించింది.

అతడు వెంటనే గుర్రం దిగి, చుట్టు పక్కల అంతా పరీక్షగా చూశాడు. దరిదాపుల్లో ఏ క్రూరమృగమూ వున్న జాడలు లేవు. మరి భానుమతి ఎందుకాగినట్టు?

కొంచెం సేపాలోచించాక కీర్తిసింహుడు, దరిదాపుల్లో తనకు హాని ఏదో కలగబోతున్న దేమోనని అనుమానించాడు.

"మరేం ఫర్వాలేదు, భానూ! ఆ హాని సంగతేదో నేను చూసుకుంటాను, పద!" అంటూ కీర్తిసింహుడు గుర్రాన్నిమెల్లగా చరిచి అధిరోహించబోయాడు.

గుర్రం చిన్నగా సకిలిస్తూ పక్కకు తప్పుకున్నది.

"సరే, కొద్ది దూరం నెమ్మదిగా నడిచి వెళదాం!" అంటూ కీర్తిసింహుడు ఒరలోంచి కత్తి దూసి పట్టుకుని నెమ్మదిగా నడవసాగాడు. భానుమతి అతన్ని అనుసరించింది. ఇద్దరూ నెమ్మదిగా యాభై గజాల దూరం ముందుకు నడిచారు.

ఆ సమయంలో, తన తలపై నుంచి ఏదో అతి సన్నని వస్తువు, వేగంగా గాలిని కోస్తూ వస్తున్న శబ్దం వినిపించి, కీర్తిసింహుడు మెరుపులా తల పైకెత్తి చూశాడు.

అక్కడ వున్న ఒక పెద్ద చెట్టుపైనుంచి, అడవుల్లో క్రూరమృగాలను పట్టుకోవటానికి భిల్లులు ఉపయోగించే సన్నని ఇనుపవల

చేరుకున్నాడు. అక్కడి నుంచి దిగువకు ఉత్తరంగా ప్రయాణం చేస్తే, కోసల రాజధాని చేరుకోవచ్చు. తూర్పు దిశగా ప్రయాణిస్తే, కోసలకు తూర్పు సరిహద్దున వున్న తూర్పుటడవులూ, అందులోని శక్తి ఆలయమూ, అటు పైన దానికి అవతలవున్న కాంభోజ రాజ్యమూ వస్తాయి.

అక్కడి వరకూ వాయువేగంతో ప్రయాణించిన భానుమతి, ఆ ప్రాంతం చేరేసరికి హఠాత్తుగా ఆగిపోయింది.

ఒక రోజు పాటు ఎక్కడా ఆగకుండా, ఒకే వేగంతో ప్రయాణించగల భానుమతి, ఇంకా అట్టే దూరం రాకుండానే హఠాత్తుగా ఆగిపోవటం, కదలనని మొరాయించటం

ఒకటి, అతి వేగంగా కీర్తిసింహుడి మీదికి వస్తున్నది. అతడు తల పైకెత్తి చూసే సరికే, వల అతడి తలను తాకింది.

కీర్తిసింహుడు వెంటనే కత్తితో దాని వేగాన్ని ఆపి, దాన్ని తిరిగి పైకి నెట్టేస్తూ, ఒక్క ఉదుటున ఎగిరి పక్కకు దూకాడు. అతడిని వెన్నంటి వస్తున్న భానుమతి మీదికి ఆ వల జారి, భానుమతి అందులో చిక్కుకుపో యింది.

క్షణంలో తెప్పరిల్లిన కీర్తిసింహుడు, తన నడుమున వున్న చిన్న చురకత్తి తీసి చెట్టు మీదికి విసరబోయాడు. అంతలోనే మరొక వైపు నుంచి చెట్టు మీదికి బాణవర్షం కుర వటమూ, ఆ బాణాల తాకిడికి చావుకేకలు పెడుతూ ముగ్గురు భటులు చెట్టుపై నుంచి కిందపడి గిలగిల తన్నుకుని మరణించటమూ క్షణాల మీద జరిగిపోయింది.

ఈ హఠాత్సంఘటనలు చూసి విస్మయా నికి లోనైన కీర్తిసింహుడు, కత్తి పైకెత్తి బాణాలు వచ్చిన దిశగా చూస్తూ, "ఎవరక్కడ?" అని కేకవేశాడు.

అతడి ప్రశ్నకు జవాబుగా, ఎదురుగా వున్న చెట్టు చాటు నుంచి, తలపాగా ధరిం చిన నూనూగు మీసాల యువకుడొకడు ఇవ తలికి వచ్చి, కీర్తిసింహుడికి నమస్కరించాడు.

కీర్తిసింహుడు కొంచెం ఆశ్చర్యంగా అతణ్ణి చూసి, "ఎవరు నువ్వు? ఈ చచ్చిన వాళ్ళెవరు?" అని ప్రశ్నించాడు.

"వాళ్ళెవరో నాకూ తెలియదు! వాళ్ళ దుస్తులు వెతకండి, ఏమైనా ఆనవాళ్ళు





దొరకవచ్చు," అన్నాడు యువకుడు విన యంగా.

కీర్తిసింహుడు మారుమాట్లాడకుండా వెళ్ళి, ముందు భానుమతిని వలలోనుంచి తప్పించి, తర్వాత చచ్చిన శత్రుభటుల దుస్తుల్లో ఆన వాళ్ళ కోసం వెతక సాగాడు. అతడు ఆ పనిలో నిమగ్నమై వుండగా, యువకుడు కత్తి చేత బట్టుకుని, శత్రువులెవరైనా వస్తే ఎదుర్కోవ డానికి సిద్ధంగా నిలబడ్డాడు.

ముగ్గురు భటులదుస్తుల్నీ పూర్తిగా వెతికి చూసిన కీర్తిసింహుడికి, ఒకడు కాంభోజ దేశా నికీ, ఒకడు చాక్య దేశానికీ, ఆఖరి వాడు నగ దేశానికీ చెందిన వాళ్ళని మాత్రం తెలిసింది. అయితే, కోసల, కాంభోజ దేశాల మధ్య శత్రుత్వమూ, తరతరాల నాటి కథా కొంత తెలిసివున్న కీర్తిసింహుడు ఆ మూడు దేశాలూ ఏకమై కుట్ర పన్నుతున్నాయన్న విషయాన్ని సులభంగానే గ్రహించగలిగాడు.

తర్వాత అతడు, యువకుడి వైపు తిరిగి, "ఇప్పుడు చెప్పు, ఎవరు నువ్వు?" అని ప్రశ్నిం చాడు. ఆ ప్రశ్నకు యువకుడు మృదుగంభీ రంగా, "ఆ ప్రశ్నకు జవాబు చెప్పబోయే ముందు, నేనొక చిన్న ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్పండి," అన్నాడు.

"ప్రశ్నా?" అంటూ ఆశ్చర్యపోయి కీర్తిసిం హుడు, యువకుణ్ణి పరీక్షగా చూస్తూ, "సరే, ఏమిటది?" అని ప్రశ్నించాడు.

యువకుడు కొద్దిగా తల పక్కకు తిప్పు కుంటూ, "ఆకాశానికి రాజూ, రాణీ ఎవరు?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వినగానే కీర్తిసింహుడు, యువ కుణ్ణి మరింత పరీక్షగా చూస్తూ, చిరునవ్వుతో, "శక్తిసేనా!" అంటూ పలకరించాడు.

యువకుడి వేషంలో వున్న శక్తిసేన తల వంచుకుంటూ, "నాప్రశ్నకు సమాధానం అది కాదు!" అన్నది.

కీర్తిసింహుడు చిన్నగా నవ్వాడు. అతడికి, కార్తీక పౌర్ణమినాడు తల్లితో బాటు కార్తీక దీపోత్సవానికి వచ్చి, ఆకాశంలో తళ తళ మెరుస్తున్న వేన వేల నక్షత్రాల మధ్య వెన్నెల కాంతుల్ని వెదజల్లుతున్న చంద్రుణ్ణి చూసి పరవశించిపోతూ, "అబ్బ! ఆకాశం ఎంత

బాగుందో! నదిలోని దీపాలకంటే, ఆకాశంలో నక్షత్రాలే బాగున్నాయి. ఇక్కడ రాజయ్యేకంటే ఆకాశానికి రాజయితే ఇంకా బావుంటుంది. కీర్తిసింహా! నువ్వు ఆకాశానికి రాజువవుతావా?" అంటూ తనను ప్రశ్నించిన బాల శక్తిసేన మాటలూ, తన జవాబూ గుర్తుకొచ్చాయి.

"ఆహాఁ, నేను తప్పకుండా ఆకాశానికి రాజునై, నిన్ను రాణీని చేస్తాను," అన్నాడా రోజున కీర్తిసింహుడు.

ఆ సంభాషణ విన్న కీర్తిసింహుడి తల్లీ, శక్తిసేన తల్లీ నవ్వుకున్నారు.

శక్తిసేనిప్పుడు, ఆ ప్రశ్నకు తను చెప్పబోయే సమాధానం ద్వారా, తనకు ఆమెపై బాల్యంలో గల అనురాగం ఇప్పుడు వున్నదా లేదా అన్న విషయం పరీక్షించదలచి, ఆ ప్రశ్న అడిగిందని అర్థం చేసుకున్నాడు కీర్తిసింహుడు.

కీర్తిసింహుడు నవ్వుతూ శక్తిసేనను సమీపించి, "ఆకాశానికి రాజు కీర్తిసింహుడు. రాణి శక్తిసేన! సమాధానం సరిపోయిందా, మహారాణీ?" అన్నాడు.

శక్తిసేన సిగ్గుతో తలవంచుకున్నది.

"ఇంతకూ, ఈ వేషంలో నువ్విప్పుడు ఇక్కడి కెందుకొచ్చినట్టు, శక్తీ?" అని ప్రశ్నించాడు కీర్తిసింహుడు.

"స్వయంగా మహారాజే నన్ను పంపారు!" అంటూ శక్తిసేన అంతా వివరంగా చెప్పి, తన దుస్తుల మాటున దాచిన చిన్న దంతపు పెట్టె తీసి కళ్ళకద్దుకుని, అతడి కందించింది.



వెంటనే కీర్తిసింహుడు మరణించిన ముగ్గురు భటులను చూపుతూ, "నువ్విలా ఈ పెట్టెతో బయలుదేరి వస్తున్న వార్త తెలిసి, వీళ్ళు కూడా వచ్చారంటావా?" అన్నాడు సాలోచనగా.

"నేను వస్తున్న వార్త వీళ్ళకు తెలిసే అవకాశం తక్కువ, కీర్తిసింహా! మహారాజు చాలా అవ్యవధిగా, నా ప్రయాణం నిర్ణయించారు. వీళ్ళు కూడా ఆసరికే కుట్రపన్ని వుంటారు," అన్నది శక్తిసేన.

"కావచ్చు! నన్ను బంధించి, నా ప్రాణం పణంగా పెట్టి హారం సంపాయించాలని అనుకుని వుంటారు. ఏది ఏమైనా ఈ కుట్రలో ముగ్గురు దేశాధిపతులు భాగస్వాములని



స్పష్టమవుతున్నది. ప్రస్తుతం మనకున్న వ్యవధి చాలా తక్కువ. వీళ్ళు ముగ్గురూ నన్ను బంధించి అనుకున్న సమయానికి చేరవలసిన చోటు చేరకపోయేసరికి, కుట్రదారులు తిరిగి నా కోసం గాలింపు ప్రారంభిస్తారు. కనుక, మనం సాధ్యమైనంత త్వరగా పని ముగించుకుని నగరం చేరాలి!" అంటూ కీర్తిసింహుడు పెట్టెలోంచి ఉత్తరం తీసి చదివి, "పరమేశ్వరి తల వంచేది ఎవరి ముందు?" అని శక్తిసేనను ప్రశ్నించాడు.

శక్తిసేన నవ్వి, "ప్రశ్న మరొక్కసారి చదువు! పరమేశ్వరి కూడా స్త్రీయే. స్త్రీ తల వంచేది ఎవరి ముందు? తనభర్త ముందు! పరమేశ్వరి తల వంచేది పరమేశ్వరుడి ముందు," అన్నది.

"ఓహో, అదా! ఇక మిగిలినవి తేలిగ్గానే స్ఫురిస్తున్నవి. పరమేశ్వరుడు నివసించేది ఉత్తర దిక్కున! మనిషికి జీవనాధారమైన ఆహారాన్ని ప్రసాదించేదీ, పంచభూతాలలో ఒకటీ అయినది భూమి! భూమి నంతటినీ ఒక్క అడుగుతో కొలిచిన వామనుడు అడిగిన మొత్తం, మూడు అడుగులు!" అన్నాడు కీర్తి సింహుడు.

"ఇంత వరకు గ్రహించటం సులభమే, కీర్తిసింహా! కాని, ఈ ఆధారాలతో హారం ఎక్కడున్నదీ ఎలా తెలుస్తుంది?" అని శక్తి సేన ప్రశ్నించింది.

కీర్తిసింహుడు కొద్దిసేపు ఏమీ మాట్లాడకుండా, ఆలోచిస్తూ వుండిపోయి, చివరకు, "శక్తీ! ఈ ఆధారాలను బట్టి చూస్తే, హారం శక్తి ఆలయంలో ఉత్తర దిక్కున, భూమిలో మూడడుగుల లోతున పాతి పెట్టి వుంటుం దనిపిస్తున్నది!" అన్నాడు.

అతని మాటలు వినగానే శక్తిసేన ముఖం వికసించింది.

కీర్తిసింహుడు కదులుతూ, "పద, శక్తీ! పొద్దు వాలేలోగా మనం శక్తి ఆలయం చేరుకోవాలి," అన్నాడు.

శక్తిసేన అవునన్నట్టు తల వూపింది. ఇద్దరూ తమ గుర్రాలను అడవి చెట్లకిందుగా దౌడు తీయించారు.

వాళ్ళు శక్తి ఆలయం చేరేసరికి, ఇంకా కొంత పొద్దు మిగిలి వున్నది. ఇద్దరూ గుర్రాలు

దిగి ఆలయంలోకి నడిచారు. నిత్యం చూసే వారు లేక, ఆలయ ప్రాంగణమంతా పిచ్చి మొక్కలు ఏపుగా పెరిగివున్నవి. ఆలయం అంతా దుమ్మూ ధూళితో పాటు సాలెగూళ్ళతో నిండి వున్నది.

ఎంతో వైభవంగా వుండవలసిన ఆ ఆలయం, ఇంతటి శిథిలావస్థలోవుండడం చూసే సరికి, శక్తిసేనాకీర్తిసింహులిద్దరికీ హృదయం ద్రవించింది.

కీర్తిసింహుడు, శక్తిసేన వెంట తీసుకు వచ్చిన తాళంచెవులతో, ముఖద్వారం తెరుచుకుని, గుడి లోపలికి అడుగు పెట్టారు. లోపల గర్భగుడిలో, ముక్కున తళ తళ మెరుస్తున్న వజ్రపు ముక్కెరతో నల్లని శక్తి విగ్రహం సాక్షాత్కరించింది.

శక్తిసేన, కీర్తిసింహుడు నేల మీద మోకరిల్లి, శక్తి విగ్రహానికి భక్తితో చేతులు జోడించి నమస్కరించారు.

"అమ్మా, మహాశక్తీ! న్యాయంగా నాదైన సొమ్ము కోసం ఆశపడి వచ్చాను. సొమ్ము నాదైనా, ఫలితం ప్రజలకు పంచిపెడతానని, నీ ముందు ప్రతిన చేస్తున్నాను. నా అర్హతానర్హతలు నాకంటే, నీకే తెలుసు! నీకరుణకు పాత్రుడినైతే చాలు, అంతకు మించిన అర్హత ఏదీ లేదు. నన్ను పాల ముంచినా, నీట ముంచినా ఆ భారం నీదే, తల్లీ!" అంటూ శక్తికి మనసా నమస్కరించి లేచాడు, కీర్తిసింహుడు.

శక్తిసేన అతడిని అనుసరించింది.

ఇద్దరూ ఆలయప్రాంగణంలో పెరిగిన పిచ్చి మొక్కలను తప్పించుకుంటూ, ఉత్తరపు దిశగా వెళ్ళారు. అక్కడ, ఏపుగా పెరిగిన రకరకాల మొక్కల మధ్య, పెద్ద బిల్వవృక్షం ఒకటి వున్నది.

కీర్తిసింహుడు ఆ వృక్షాన్ని పాలోచనగా చూస్తూ, "శక్తీ, చూశావా! మహాశివుడికి అత్యంత ప్రీతి దాయకమైన బిల్వ వృక్షం ఇది. హారాన్ని ఇక్కడే పాతిపెట్టి వుంటారు," అన్నాడు.

"నీ ఊహ నిజమే కావచ్చు. కాని తవ్వటం ఎలా?" అంటూ శక్తిసేన కాస్త నిరుత్సాహంగా ప్రశ్నించింది. —(ముగింపు వచ్చేసంచికలో)






# ఇద్దరు స్వార్థపరులు!

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రాన, అంతఃపురంలో మంచి సుఖనిద్రలో వుండవలసిన నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నాకు చెప్పనలవికాని జాలి కలుగుతున్నది. అంతే కాదు, స్వార్థపరులతో నిండిన ఈ ప్రపంచం, నిస్వార్థమైన నీ శ్రమను ఎంతవరకు గుర్తిస్తుందోనన్న అనుమానం కూడా నాకు కలుగుతున్నది. స్వార్థపరులైన వ్యక్తులు, నీతి నియమాలను మరచి ప్రవర్తిస్తారన్నది నీకు తెలియని విషయం కాదు! అయినప్పటికీ, నీకు మరింత హెచ్చరికగా వుండేందుకు గాను వైశాలీ, శివచంద్రులనే వాళ్ళ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



విశాల దేశాన్ని పాలించే మహాదత్తుడికి, వైశాలి ఏకైక సంతానం. ఆయన ఆమెకు సమస్త విద్యలూ నేర్పించాడు. యుక్తవయస్కురాలయే సరికి, అపురూప సౌందర్యరాశిగానూ, అమిత మేధావిగానూ గణుతికెక్కిన వైశాలినిని వివాహమాడేందుకు, వివిధ దేశాల రాకుమారులు పోటీలు పడసాగారు. మహాదత్తుడు, తగిన యువకుణ్ణి చూసి వైశాలికి వరుడుగా నిర్ణయించే ప్రయత్నంలో, ఒకనాడు నలుగురైదుగురు రాకుమారుల చిత్రాలు, కుమార్తె అభిప్రాయం కోసం చూపించాడు.

వైశాలి ఆ చిత్రాలు చూసి పెదవి విరుస్తూ, "నాన్నా! విశాల దేశానికి మహారాజు కాబోయే యువకుడు, సహజంగా పుట్టుకతో అబ్బిన గుణాలతో సుందరుడూ, ధీరుడూ అయివుండాలని నా కోరిక. ఈ చిత్రాల్లోని యువకుల్లో కృత్రిమత్వం తప్ప సహజత్వం నాకు కనిపించడం లేదు," అన్నది.

వీరులుగా ఖ్యాతి కెక్కిన ఆ రాకుమారుల గురించి కుమార్తె చేసిన వ్యాఖ్యకు ఆశ్చర్యపోయిన రాజు, కుమార్తె మనసు నొప్పించలేక వూరుకున్నాడు.

ఇలా వుండగా — విశాల దేశానికి ఉత్తరాన గల కేసర పర్వతారణ్యాలలో, ఒక బ్రహ్మరాక్షసి తిరుగుతూ,అక్కడ గిరిజనులను చంపి తింటున్నదని గగ్గోలు బైలుదేరింది.

ఆ వార్త పుట్టిన కొద్ది రోజుల్లోనే, గిరిజనుల పెద్ద రాజదర్శనం చేసుకుని, "మహారాజా! ఆ బ్రహ్మరాక్షసి హఠాత్తుగా ఏ చెట్టు చాటునుంచో ప్రత్యక్షమై, మావాళ్ళల్లో చేతికందిన వాణ్ణి పిడికిట ఇముడ్చుకుని, ఏదో రెండు ప్రశ్నలడుగుతుంది. జవాబు చెప్పలేని వాణ్ణి గుటుక్కున మింగి వెళ్ళిపోతుంది," అని చెప్పాడు.

"ఆ బ్రహ్మరాక్షసి అడిగే, ఆ రెండు ప్రశ్నలేమిటో తెలుసా?" అని అడిగాడు మహాదత్తుడు.

"దూరంగా వుండి బ్రహ్మరాక్షసిని చూసిన మావాళ్ళకు, ఆ ప్రశ్నలేమిటో అర్థం కాలేదు, మహారాజా! రాక్షసి మాత్రం, తన ప్రశ్నలకు సరైన జవాబు చెబితే, పట్టుకున్నవాణ్ణి ప్రాణాలతో వదులుతాననడం మాత్రం స్పష్టంగా విన్నారు," అన్నాడు గిరిజనపెద్ద.

"సరే, ఆ బ్రహ్మరాక్షసిని హతమార్చే ప్రయత్నం నేను చేస్తాను. మీరు మాత్రం తగు జాగ్రత్తలో వుండండి," అని మహాదత్తుడు, గిరిజనపెద్దను పంపివేశాడు.

తర్వాత ఆయన, మంత్రి సలహా మేరకు బ్రహ్మరాక్షసి దగ్గరకు వెళ్ళి, దాని ప్రశ్నలకు జవాబు చెప్పి, దాని అంతు చూడగలిగిన వారికి, ఒక పెద్ద సంస్థానం బహూకరిస్తానని చాటింపు వేయించాడు. అలా రోజులు గడుస్తున్నాయిగాని, ప్రాణాలకు తెగించి రాక్షసి దగ్గరకు వెళ్ళడానికి, ఎవరూ ముందుకు రాలేదు. ఏం చెయ్యాలో తోచని అయోమయ పరిస్థితుల్లో రాజు కొట్టుమిట్టాడుతుండగా, శివచంద్రుడనే యువకుడు, రాక్షసి దగ్గరికి వెళతానంటూ, రాజానుమతి కోసం వచ్చాడు.



"బ్రహ్మరాక్షసి ఎటువంటి జటిలమైన ప్రశ్నలడుగుతుందో మనకు తెలియదు. దాని క్రూరత్వం, శరీర బలం తెలుస్తూనే వున్నది. నువ్వు ఏ విద్యల్లో ఆరితేరిన వాడివి?" అని మహాదత్తుడు, శివచంద్రుణ్ణి ప్రశ్నించాడు.

దానికి శివచంద్రుడు, "మహారాజా! నాకే విద్యలూ రావు. పొలాల్లో కాయకష్టం చేసి బతుకుతున్నవాణ్ణి," అని జవాబిచ్చాడు.

ఇది విని రాజు విసుగ్గా, "విద్యలు రావు, వీరుడివి కావు! ఇక ఏ ధైర్యంతో రాక్షసిని ఎదుర్కోవడానికి బైలుదేరావు? నేను బహూకరిస్తానన్న సంస్థానం మీది ఆశతో ప్రాణాలు పోగొట్టుకోకు," అన్నాడు.

శివచంద్రుడు వినయంగా, "గెలిచినా సంస్థానాన్ని ఏలుకునే పాటి తెలివితేటలు నాకు లేవు, మహారాజా! నేను ఆశపడి రాలేదు. గిరిజనులను రక్షించగలనేమో చూద్దామనే తపనతో వచ్చాను. ఎంతో పాండిత్యం గల, మా ఊరివాడే అయిన చంద్రస్వామి, నాకు సహాయంగా వస్తున్నాడు. నన్ను విశ్వసించి, అనుమతించమని ప్రార్థిస్తున్నాను," అన్నాడు.

శివచంద్రుడి ముఖంలోని గాంభీర్యమూ, అతడి మాటల్లోని నిజాయితీ గమనించిన మహాదత్తుడికి, అతడి పట్ల చులకన భావం తగ్గింది. ఆయన శివచంద్రుడికి తన అంగీకారం తెలియచేశాడు. శివచంద్రుడు సంతోషంగా సభాభవనం వెలుపలికి వచ్చి, అక్కడ



తనకోసం వేచివున్న చంద్రస్వామికి జరిగిన దంతా చెప్పాడు.

రాజు అంగీకరించిన మాట వినగానే చంద్ర స్వామి వెలవెలబోయి, "ఇదిగో, శివచంద్రా! నేను అరణ్యందాపుల కూర్చుంటాను తప్పితే, లోపలకు చచ్చినా రాను!" అన్నాడు.

"సరే, అలాగే చేద్దువుగాని, ఇక బయల్దే రుదాం," అంటూ కదిలాడు శివచంద్రుడు.

రాజభటులు దారిచూపగా, మర్నాటి మధ్యా హ్నానికల్లా వాళ్ళు కేసరారణ్య ప్రాంతాన్ని చేరారు.

రాజభటులు వాళ్ళనక్కడ వదిలి వెనుదిరిగి పోగానే చంద్రస్వామి, ఆకాశాన్నంటుతున్న అరణ్య వృక్షాలకేసి కళ్ళింతచేసి చూస్తూ, "శివ చంద్రా! నేనిక ఒక్క అడుగు ముందుకు వెయ్యను. ఈ అరణ్యం అంచున ఇక్కడే కూర్చుంటాను," అంటూ నేల మీద చతికిల బడ్డాడు. ఇంతలో అక్కడికి ఒక యువకుడు వచ్చి, తన పేరు విశాలదత్తుడని, శివచంద్రు డికి తనను పరిచయం చేసుకుని, "నువ్వు రాక్షసిని ఎలా హతమార్చుతావో చూద్దామని వచ్చాను. నేను నీ మిత్రుడికి తోడుగా ఇక్కడే వుంటాను," అన్నాడు.

దీనికి శివచంద్రుడు చాలా సంతోషించి, "నా మిత్రుడి పేరు చంద్రస్వామి, గొప్ప పండి తుడు, రాక్షసి అడిగే ప్రశ్నల విషయంలో, నాకు సాయపడేందుకు వచ్చాడు. ఇక నేను అర ణ్యంలోకి వెళతాను," అని చెప్పి బయల్దేరాడు.

శివచంద్రుడు అరణ్యంలో ఒక క్రోసు దూరం నడిచేసరికి, ఒక చెట్టు వెనకనుంచి వికవిక మంటూ పెద్ద నవ్వు వినిపించింది. అతడు అదిరిపడి తల తిప్పి చూసేంతలో, కారునల్లని శరీరచ్చాయతో వున్న రాక్షసి చప్పున అతణ్ణి సమీపించి, తన గుప్పెటలోకి తీసుకుని పైకెత్తింది.

శివచంద్రుడు ధైర్యాన్ని కూడగట్టుకుని, రాక్షసి ముఖంలోకి తేరిపార జూశాడు. తన చేత చిక్కిన మనిషి చావు భయంతో కేకలు వెయ్యకుండా, అలా చూడడం రాక్షసికి ఆశ్చ ర్యంకలిగించింది.

అది ఒక క్షణం ఆగి, "ప్రళయ భయంకర మైన నా ఆకారాన్ని చూసి భయపడని నువ్వు, మందమతివా లేక అసహాయ శూరుడివా,

అన్న అనుమానం కలుగుతున్నది. సరే, ఎవడివైతేనేం – నాప్రశ్నలకు జవాబు చెప్పు," అన్నది.

"ఏమిటా ప్రశ్నలు?" అన్నాడు శివచంద్రుడు తొట్రుపడకుండా.

"భూమి మీద ప్రత్యక్షంగా కనిపించే దైవం ఎవరు?" అని ప్రశ్నించింది రాక్షసి.

"ఇదొకటేనా, ఇంకేమైనా ప్రశ్నలున్నవా?" అన్నాడు శివచంద్రుడు.

"ఇంకొక్క ప్రశ్న కూడా వున్నది. నేరం చేసిన వ్యక్తిని శిక్షిస్తూనే, అలా శిక్షించవలసి వచ్చినందుకు అమితంగా బాధపడే వ్యక్తి ఎవరు?" అని అడిగింది రాక్షసి.

శివచంద్రుడు ఒక్క నిమిషం మౌనంగా వూరుకుని, "సరే, జవాబులు చెప్పబోయే ముందు, నా దొక్క కోరిక," అన్నాడు.

"ఏమిటది?" అన్నది రాక్షసి ఆశ్చర్యపోతూ.

"నా ప్రాణస్నేహితులిద్దరు, ఈ అరణ్యం అంచున వున్నారు. ఒక్కసారి వారిని తృప్తిగా చూసి, వీడ్కోలు తీసుకుని వచ్చి నీకు జవాబులు చెబుతాను. నీకు నా జవాబులు నచ్చాయా, మళ్ళీ వాళ్ళను చూడగలుగుతాను. లేదా..." అంటూ దీనంగా అడిగాడు శివచంద్రుడు.

తన చేతికి చిక్కి కూడా ధైర్యంగా మాట్లాడిన శివచంద్రుడి దీనాలాపనకు రాక్షసి కరిగిపోతూ, "నిజాయితీ పరుడికే ధైర్యంవుంటుంది, మోసగాళ్ళెప్పుడూ పిరికిపందలే! నువ్వు నిజాయితీగా తిరిగివస్తావనే నమ్మకంతో



వదిలిపెడుతున్నాను," అంటూ శివచంద్రుణ్ణి నేల మీదికి దింపింది.

శివచంద్రుడు పరుగు పరుగున పోయి చంద్రస్వామిని, విశాలదత్తుణ్ణి కలుసుకుని, రాక్షసి ప్రశ్నలు చెప్పి, చంద్రస్వామిని, "చప్పున జవాబులు చెప్పు!" అని అడిగాడు.

"భూమి మీద కనిపించే ప్రత్యక్ష దైవం కన్నతల్లి!" అన్నాడు చంద్రస్వామి.

"సరే, రెండోది?" శివచంద్రుడు ఆతృతగా ప్రశ్నించాడు.

"రెండవదా..." అని ఆగి, ఒక్క క్షణం ఆలోచించిన చంద్రస్వామి, "నేరస్థుడికి శిక్ష విధిస్తూ బాధపడేది దయామయుడైన రాజు కావచ్చు!" అన్నాడు.



"కాదు! కాదు!" అంటూ చప్పున కల్పించుకున్న విశాలదత్తుడు, "అది కూడా కన్నతల్లే! తనబిడ్డ నేరం చేసినప్పుడు, బిడ్డ బాగుకోరి శిక్షిస్తూ, తన బిడ్డ నేరం చేసినందుకు, అలా చేయవలసి వచ్చినందుకు అమితంగా బాధ పడుతుంది!" అన్నాడు.

శివచంద్రుడు రివ్వున వెనుదిరిగి పరిగెత్తిపోయి, రాక్షసి ఎదుట నిలబడ్డాడు. రాక్షసి అతణ్ణి మెచ్చుకోలుగా చూస్తూ, "వచ్చావా, ఇక చెప్పు!" అన్నది.

శివచంద్రుడు, రాక్షసి ప్రశ్నలకు జవాబులు చెప్పాడు. అవి వింటున్న రాక్షసి ముఖంలో అంతులేని ఆనందం కనిపించింది. అతడు చెప్పడం పూర్తి చేసిన మరుక్షణం, రాక్షసి మాయమై, ఆ స్థానంలో ఒక దేవతా స్త్రీ ప్రత్యక్షమైంది.

ఆనందాశ్చర్యాలతో చూస్తున్న శివచంద్రుణ్ణి చూసి ఆమె నవ్వుతూ, "ఆశ్చర్యపోతున్నావా, శివచంద్రా? నేను విద్యుత్ప్రభ అనే యక్షిణిని. శాపవశాత్తూ రాక్షసి నయ్యాను. నేటికి సరిగ్గా నూరు సంవత్సరాల క్రితం, ఈ ప్రాంతాల పుండరీకుడనే మహర్షి వుండేవాడు. అతడు, భార్య చనిపోగా, మిగిలిన మూడు సంవత్సరాల కుమార్తెను సాకుతూ, ఎంతో ప్రేమగా చూసేవాడు. ఒకసారి ఇటువైపు విహారార్థం వచ్చిన నేను, అతడి అందాన్ని చూసి విభ్రమ చెంది, అతడి వద్దకు వెళ్ళి, పెళ్ళి చేసుకోవలసిందిగా ప్రార్థించాను. అతడు తిరస్కరించాడు. నేను, అతడి కుమార్తెను భయపెట్టి అతణ్ణి సాధిద్దామని, నల్లటి రాక్షసిగా మారి, మొక్కల మధ్య ఆడుకుంటున్న అతడి కుమార్తెను ఎత్తుకున్నాను. నన్ను చూసి జడుసుకున్న ఆ పసిపిల్ల, ఒక్క వెర్రికేక పెట్టి నా చేతుల నుంచి జారి కిందపడింది.

కుమార్తె కేక విని పరిగెత్తుకొచ్చిన పుండరీకుడు, రుద్రుడై, నేను ఏ ఆకారంలో ఆ పసిపిల్లను భయపెట్టానో, ఆ ఆకారమే నాకు శాశ్వతమయేట్టు శపించాడు. నేను ఆ మహర్షి పాదాల మీద పడి శాపవిమోచనం ప్రసాదించమని ప్రార్థించాను.

నా ప్రార్థనకు దయాళుడైన ఆ మహర్షి కొంత శాంతించి, 'విద్యుత్ప్రభా! నీ మనసు

స్త్రీకి స్వాభావికంగా వుండవలసిన లాలిత్యాన్ని కోల్పోయింది. తన బిడ్డ నేరం చేసినప్పుడు, బిడ్డ బాగుకోరి శిక్షిస్తూనే, అలా శిక్షించవలసి వచ్చినందుకు విలవిలలాడే సున్నిత హృద యిని స్త్రీ. అంతే కాదు; ఈ సృష్టిలో భూమి మీద ప్రత్యక్షంగా కనిపించే దైవం. నీ శాపా నికి విమోచన మార్గం చెబుతున్నాను, విను! నూరు సంవత్సరాలపాటు నువ్వు ఈ రూపం లోనే జీవిస్తావు. ఆ తర్వాత, పైన నేను చెప్పి నదాన్ని రెండు ప్రశ్నల రూపంలో నువ్వు అడిగినప్పుడు, ఎవరైతే సరైన జవాబులు చెబుతారో, వారి దర్శనంతో నీకు శాపాంతం అవుతుంది,' అంటూ నేను నిన్ను అడిగిన ప్రశ్నలూ, వాటికి జవాబులూ నాకు చెప్పాడు," అన్నది.

ఆశ్చర్యంగా అంతా విన్న శివచంద్రుడు, విద్యుత్ప్రభకు నమస్కరించి, తడబడుతూ, "కానీ తల్లీ, నేను చెప్పిన జవాబులు నా స్వంతం కావు. నేనొక చదువురాని మొద్దును!" అన్నాడు.

అతడి మాటలకు విద్యుత్ప్రభ చిరునవ్వు నవ్వి, "యక్షిణి నైన నాకు, ఆ సంగతి తెలి యంది కాదు!" అంటూ తన కుడిచేతిని శివచంద్రుడి శిరస్సు మీద ఆన్చి, "నాయనా, శివచంద్రా! సమస్త శస్త్ర శాస్త్రాల్లోనూ నిన్ను మించిన వాడుండడు. మా యక్షులకు సహజ విద్యలైన అణిమ, మహిమాది అష్ట సిద్ధులు కూడా నీకు వశమవుతాయి!" అంటూ అతణ్ణి ఆశీర్వదించి అంతర్ధానమైంది.



అంతులేని ఆనందంతో తిరిగి వచ్చిన శివచంద్రుడు, జరిగినదంతా చంద్రస్వామికి, విశాలదత్తుడికి చెప్పాడు.

వెంటనే చంద్రస్వామి, "నువ్వు యక్షిణి చేతి వరాలు పొంది వచ్చిన మహావీరుడివి! ఇక నా దారిన నేను పోతాను!" అని కోపంగా అక్కడి నుంచి చరచరా వెళ్ళిపోయాడు.

జరిగినదానికి నివ్వెరపోయి చూస్తున్న శివ చంద్రుడితో, విశాలదత్తుడు, "అతడు స్వార్థ పరుడు, ఈర్ష్యాళువు. బాధపడకండి," అని, తన దుస్తుల్లోంచి గంధపు పూసలతో చేసిన ఒక హారం తీసి, శివచంద్రుడి మెడలో వేస్తూ, "సామాన్యపు చెక్కలా కనిపిస్తూనే, అపూర్వ సుగంధాలు వెదజల్లే ఈచందనానికీ, నీకూ

చాలా సామ్యం ఉన్నది. ఇది, నాగుర్తుగా నీ దగ్గర వుండనీ!" అన్నాడు.

శివచంద్రుడు ఒక్కక్షణం మౌనంగా వూరుకుని, "చంద్రస్వామి ఈర్ష్యకు కారణం తెలుస్తున్నది. కానీ, మీ ఆదరణలోని అంతరార్థం గ్రాహ్యం కావడం లేదు, రాకుమారీ?" అన్నాడు.

ఆ మాటలతో, విశాలదత్తుడుగా వచ్చిన వైశాలి, సిగ్గుపడుతూ నవ్వి, "ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఇక నేను వెళతాను!" అంటూ శివచంద్రుడి దగ్గర శెలవు తీసుకుని వెళ్ళిపోయింది. ఆ తర్వాత బైలుదేరి రాజధాని చేరిన శివచంద్రుడు, రాజు మహాదత్తుడి చేత ఘనంగా సన్మానించబడి, ఆయన కోరిక మీద రాకుమారి వైశాలిని వివాహం చేసుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఖ్యాతికెక్కిన రాకుమారులకు వంకలు పెట్టిన వైశాలి, శివచంద్రుడికి యక్షిణి వరాలివ్వగానే అతణ్ణి వరించడానికి కారణం స్వార్థమే కదా? పైగా తన ఈలోపాన్ని కప్పిపుచ్చుకునేందుకు చంద్రస్వామిని స్వార్థపరుడన్నది. యక్షిణి వరాలు పొందిన శివచంద్రుడు, ఆమెలోని స్వార్థచింతనను గ్రహించే వుండాలి. అయినా, అతడామెను వివాహమాడాడంటే, అందుక్కారణం రాజు కావచ్చన్న మితిమీరిన స్వార్థమే కదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వైశాలికోరుకున్నది సహజంగా మనిషికి లభించే అంతః సౌందర్యాన్నని, ఆమె మాటల ద్వారా తెలుస్తున్నది. శివచంద్రుడు సాటి మనుషులకోసం ప్రాణత్యాగానికి సిద్ధపడడమే గాక, తన నీతినిజాయితీలతో యక్షిణి కృపకు పాత్రుడయ్యాడు. అటువంటి వాణ్ణి, ఏ స్త్రీ అయినా మనస్ఫూర్తిగా వరిస్తుంది. వైశాలి ఆంతర్యం, ఆదరణ గుర్తించిన శివచంద్రుడు, ఆమెతో వివాహానికి ఇష్టపడ్డాడు. ఈ కారణాల వల్ల వాళ్ళను స్వార్థపరులనడం, ఏమాత్రం సహేతుకం కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : లలిత–శర్మిల రచన]



# టేకుచెట్టు




ఇంటి ద్వారబంధం, తలుపులు, కిటికీలు ఇంట్లోని బల్లలు, కుర్చీలు మొదలైనవి చేయడానికి ఉపయోగించే అతి ఖరీదయిన కలప ఏది? అని అడిగితే, టేకు అని ఎవరయినా చెబుతారు. ఖరీదయినది మాత్రమే కాదు; గృహోపకరణాలు చేయడానికి చాలా శ్రేష్ఠమైన కలప టేకు. లాటిన్ భాషలో టేకును 'టెక్టోనా గ్రాండిస్' అని అంటారు.ఇది 'టెక్టాన్' అనే గ్రీకు పదం నుంచి వచ్చింది. 'టెక్టాన్' అంటే వడ్రంగి అనీ, 'గ్రాండిస్' అంటే పెద్దదీ, లావయినదీ అనీ అర్థం. చెట్లన్నిటిలోకీ చాలా ఎత్తయినదీ, లావయినదీ కావడం వల్ల దీనికా పేరు వచ్చింది. బాగా పెరిగిన టేకుచెట్టు కనీసం30 నుంచి 60 మీటర్ల ఎత్తు ఉంటుంది. 60 మీటర్ల ఎత్తు వరకు పెరిగే టేకుచెట్లు కూడా ఉన్నాయి.

చెట్టుకు నాలుగు వైపులా కొమ్మలు ఉంటాయి. ఒక్కొక్కటీ 60 సెం.మీ. పొడవూ, 30 సెం.మీ. వెడల్పుతో ఆకులు ఒకదానికొకటి ఎదురెదురుగా ఉంటాయి. చిన్న మొక్కలుగా ఉన్నప్పుడు ఆకులు మరీ పెద్దవిగా, అంటే ఒక్కొక్క ఆకు చిన్న గొడుగులాగా ఉంటుంది. ఆకులు పైభాగంలో గరుకుగానూ అడుగు భాగంలో ఎరుపు ఊదా రంగుతో మృదువుగానూ ఉంటాయి. ఋతు పవనాలప్పుడు,చిన్నచిన్న తెల్లటిపువ్వులు కొమ్మల చివర గుత్తులు గుత్తులుగా పూస్తాయి. నవంబర్ - జనవరి నెలల మధ్య ఆకులు రాలిపోయి, చెట్లు బోసిగా, మోడుల్లా కనిపిస్తాయి.

టేకు కలప నాణ్యతకూ, మన్నికకూ పేరెన్నిక గన్నది. చాలా దృఢమైనది. అందుకే రైలు పెట్టెల తయారీలోనూ, ఓడల నిర్మాణానికీ టేకును ఉపయోగిస్తారు. వంతెనలు నిర్మించడానికీ, వాహనాల చక్రాల ఊచలకు కూడా టేకును ఉపయోగిస్తారు. మహారాష్ట్రలోని కార్లా గుహల పైకప్పుకు వాడిన టేకు వాసాలు రెండు వేల సంవత్సరాలు గడిచినప్పటికీ ఇంకా అలాగే చెక్కుచెదరకుండా పదిలంగా ఉండడం టేకు నాణ్యతకు తార్కాణం!

ఉత్తరాది రాష్ట్రాలలో లభించే టేకు కన్నా, కేరళ, కర్ణాటక ప్రాంతాలలో లభించే టేకు శ్రేష్ఠమైనది. ఈ రెంటికన్నా, బర్మాటేకు చాలా ప్రశస్తమయినది.

# సుప్రసిద్ధ మతగ్రంథాలు




## జెండ్ అవెస్తా

ఏడవ శతాబ్దంలో పర్షియా - ఇరాన్ ప్రాంతాల నుంచి కొందరు పార్సీలు భారతదేశానికి వలస వచ్చారు. ఆనాటి నుంచి మనదేశాన్ని తమ మాతృదేశంగా భావిస్తూ, దేశ అభివృద్ధికి కృషి చేస్తూన్న పార్సీలు అల్ప సంఖ్యాకులే అయినప్పటికీ దేశమంతటా అక్కడక్కడా నివసిస్తున్నారు.

పార్సీలు, సుప్రసిద్ధ మేధావి, ప్రవక్త అయిన జొరాష్టర్ (జరతుష్ట్ర) బోధించిన జొరాష్ట్రియన్ మతాన్ని అవలంబిస్తున్నారు. జొరాష్టర్ క్రీస్తు కుదాదాపు వెయ్యి సంవత్సరాలకు పూర్వం జీవించి వుండవచ్చని చరిత్రకారులు అభిప్రాయ పడుతున్నారు. ఒక కొండ మీద దీక్షతో ఏకాంత జీవనం గడిపిన జొరాష్టర్, ఆ కొండ పూర్తిగా అగ్నికి ఆహుతి కావడంతో, అక్కడినుంచి బయటపడి, ప్రజలకు తన బోధల ద్వారా ఉత్తమ మార్గాన్ని చూపాడని చెబుతారు.

జొరాష్టర్ బోధనలు 'జెండ్ అవెస్తా'లో పొందుపరచబడ్డాయి. ఆరంభ కాలంలో ఇరవై ఒక్క అవెస్తాలు ఉండేవి. అవన్నీ కాల

జొరాష్టర్ జన్మించినప్పుడు ఆయన చుట్టూ వింత కాంతి వ్యాపించిందట. శిశువు ఏడ్వలేదట, నవ్వాడట. పసివాడుగా ఉన్నప్పుడు కూడా ఆయన నవ్వుతూ ఉండేవాడట. ఎవరయినాఅడిగితే, "మంచినే తలుస్తూ, మంచినే ఆచరిస్తూ, మీకు భగవంతుడు ప్రసాదించింది, పది మందితో పంచుకుంటూ వుంటే మీరూ నాలాగే హాయిగా నవ్వుతూ ఉండవచ్చు," అనేవాడట. దేశంలో కరువు ఏర్పడినప్పుడు ఆయన తల్లిదండ్రులు తమకున్నదంతా పేదలకు పంచేసి తాము సంతోషంగా పస్తులున్నారు. జొరాష్టర్ సత్యాన్వేషణకు బయలుదేరినప్పుడు తండ్రి ఇవ్వచూపినసంపదనంతా వద్దని ఇంటి జ్ఞాపకార్థం నడుముకు కట్టుకునే బెల్టును మాత్రం తీసుకున్నాడు. ఆయన ఒక కొండ మీదికి చేరి, అక్కడ పదేళ్ళ పాటు ఎన్నో కష్టాలు ఎదుర్కొని దీక్షతో జ్ఞానాన్వేషణ సాగించాడు. ఆఖరికి 'అహురా మజ్దా' (దివ్య కాంతి)తో సంభాషణ జరిపి తన ప్రశ్నలకు, సందేహాలకు సమాధానాలు కనుగొన్నాడు. దివ్య కాంతి తనకు క్లుప్తంగా చెప్పిన మంచి ఆలోచనలు, మంచి మాటలు, మంచి చేతలు అనే తన ఉన్నతమైన సిద్ధాంతాన్ని ప్రజలకు బోధించి వాళ్ళు మంచి మార్గంలో నడవడానికి దారి చూపాడు.

ప్రవాహంలో కొట్టుకుపోగా ఇప్పుడు ఒక పూర్తి గ్రంథం, మరికొన్ని గ్రంథాల భాగాలు మాత్రమే లభ్యమవుతున్నాయి. జెంద్ అవెస్తా బోధనలకూ మన వేద సూక్తులకూ సారూప్యత ఉండడం చెప్పుకోదగ్గ విశేషం.



వెలుగుకూ, సత్యానికీ అధిపతి అయిన 'అహురా మజ్దా'కూ - చీకటికీ, దుష్టశక్తులకూ నాయకుడయిన 'అహ్రిమాన్'కూ మధ్య నిరంతర పోరాటం సాగుతూ వుంటుంది. ఈ పోరాటంలో శిష్టశక్తులకే అంతిమ విజయం అని అవెస్తా చాటుతున్నది.

మానవుడు 'అర్మాజ్ద్' సృష్టి అయినప్పటికీ, అతడి మీద దుష్టశక్తుల ప్రభావం కూడా ఉంటుంది. సత్యం కోసం నిలబడి మనిషి పవిత్ర జీవితంసాగించినట్టయితే — సత్యం, వెలుగుల విజయం మరింత త్వరలోసిద్ధిస్తుంది — అని జొరాష్టర్ బోధించాడు. ఆయన బోధనలలో మరికొన్ని :

"మనిషికి మంచి పనుల ద్వారా దివ్యత్వం సిద్ధిస్తుంది. మనిషి సత్యం కోసం నిరంతరం పాటుపడాలి. ఆ ప్రయత్నమే అతన్ని భగవంతుడి దగ్గరికి చేరుస్తుంది."

"మనిషి నిజాయితీగా సత్యానికి కట్టుబడి నడుచుకుంటే మహత్తర ఫలితం లభిస్తుంది."

"దైవప్రణాళికను, ప్రయోజనాన్ని మనసులో పదిల పరచుకోవాలి. వాటిని గురించే నిరంతరం మననం చేయాలి."

"న్యాయంఇదిఅనితెలిసీ,దానిని అచరించలేకపోవడం పిరికితనం."

# మీకు తెలుసా?

1. గల్ఫ్ దేశాలలో అతి చిన్నది ఏది?
2. మన జాతీయ చిహ్నంలో మూడు మృగాల బొమ్మలున్నాయి. అవి ఏవి?
3. పిల్లల సంతోషం కోసం కృషి చేసిన వారిని యేటా పోలండు దేశం పిల్లలు అవార్డుతో గౌరవిస్తారు. ఆ అవార్డు ఏది? దానిని అందుకున్న ఏకైక భారతీయుడు ఎవరు?
4. 'మెసపొటేమియా' అంటే రెండు నదుల మధ్య ప్రదేశం అని అర్థం. అది ఏ నదుల మధ్య ఉన్నది? దాని ఈనాటి పేరు ఏమిటి?
5. ప్రప్రథమ భారతీయ అంతరిక్షగామి ఎవరు?
6. మామూలుగా వేణువుకు ఎన్ని రంధ్రాలుంటాయి?
7. చెర్నోబిల్ దుర్ఘటన ఎప్పుడు జరిగింది?
8. ఝాన్సీ లక్ష్మీబాయికి చిన్నప్పుడు ఇంకొక పేరు ఉండేది. అది ఏది?
9. 'ప్రెషర్ కుక్కర్'ను ఎవరు కనుగొన్నారు?
10. ప్రపంచ దేశాలతో పోలిస్తే వైశాల్యంలో మనదేశం స్థానం ఎంత?
11. ఒకే కుటుంబం నాలుగు నోబెల్ బహుమతులను అందుకున్నది. ఆ కుటుంబం ఏది?
12. మన జాతీయ పతాకంలోని మూడు రంగులను సూచించిన వారెవరు?
13. ఒక బొట్టు రక్తం, శరీరమంతా ప్రసరించి రావడానికి ఎంతసేపు పడుతుంది?
14. అంటార్కిటికాలో మనదేశం ఏర్పాటుచేసిన మొట్టమొదటి స్థావరం ఏది?
15. జీడిమామిడిలో ఎక్కువగా వున్న విటమిను ఏది?
16. ఆంగ్లంలో వెలువడిన మొట్టమొదటి పిల్లల పత్రిక పేరేమిటి?

## సమాధానాలు

1. బెహ్రెయిన్.
2. సింహం, గుర్రం, ఎద్దు.
3. ఆర్డర్ ఆఫ్ స్మైల్; కార్టూనిస్ట్ శంకర్ (కె. శంకర్ పిళ్లై – 'చిల్డ్రన్స్ వరల్డ్' వ్యవస్థాపక సంపాదకుడు)
4. యూఫ్రేట్స్, టైగ్రిస్; ఇరాక్.
5. రాకేష్ శర్మ.
6. ఎనిమిది.
7. ఏప్రిల్ 25, 1986.
8. మణికర్ణిక.
9. రాబర్ట్ బోయెల్.
10. ఏడవది.
11. క్యూరీస్. మేరీక్యూరీ 2; భర్త పిరీక్యూరీ 1, కుమార్తె ఐరీన్ క్యూరీ 1.
12. పింగళి వెంకయ్య.
13. 20 నిమిషాలు.
14. దక్షిణ గంగోత్రి.
15. సి విటమిను.
16. ది లిల్లీపుటియన్.




# పెళ్ళిదొంగ

కాంచనపురం అనే ఊళ్ళో కుచేలయ్య అనే పేదవాడుండేవాడు. ఆయన తాతతండ్రులు మంచి ఆస్తిపరులు. అయితే, అతడి తండ్రి వ్యాపారంలో బాగా నష్టపోయి, ఆ దిగులుతో చనిపోయాడు. అప్పటికి కుచేలయ్యకు నలుగురు పిల్లలు.

అతడు వున్న ఊళ్ళో కూలీనాలీ చేసుకుని బతుకు సాగించడం అవమానంగా తోచి, చాలా దూరంలో వున్న మరొక ఊరుకు భార్యాపిల్లలతో వలస పోయాడు. అక్కడ అతడెంత కష్టపడి పనిచేసినా, ఆ సంపాదనతో అతడి కుటుంబ అవసరాలు తీరేవి కావు.

ఇలా వుండగా — కుచేలయ్యకు ఒకరోజు ఎక్కడా పని దొరకలేదు. ఊరు నిండా చేసిన చిల్లర అప్పులు తీర్చకపోవడంతో, ఎర్రని ఏగాణీ ఇచ్చేవాడు కనిపించలేదు. కడుపు ఆకలితో భగభగ మండిపోతున్నది. అంతకంటే అతడికి ఎక్కువ బాధ పెళ్ళాం పిల్లల ఆకలి తీర్చలేకపోతున్నానే అన్నది. ఇలా తీరని ఆవేదనతో రోజంతా అక్కడా ఇక్కడా తిరిగిన కుచేలయ్య, సాయంత్రం అయ్యేసరికి ఒక సంపన్నుడిఇంటిముందునుంచివెళ్ళసాగాడు.

ఆ సంపన్నుడి ఇల్లంతా చాలా సందడిగా వున్నది. ఒక పందిరి కింద, చుట్టూ దడి కట్టి వంటలుచేస్తున్నారు. ఆ వంటల ఘుమఘుమలతో కుచేలయ్యకు ప్రాణం లేచివచ్చింది.

కుచేలయ్య ఆగి, వంటలు జరుగుతున్న ప్రదేశాన్ని జాగ్రత్తగా పరిశీలించ సాగాడు. అందరూ భోజనాల సందడిలో వున్నారు. అతడు ఒకసారి తన మాసిపోయిన పంచె, చిరిగిన చొక్కాకేసి చూసుకున్నాడు. ఈ స్థితిలో తను పెళ్ళివారితో కలిసి భోజనం చెయ్యలేడు. మరేం చెయ్యాలి? కుచేలయ్య బాగా ఆలోచించి వంట కోసం కట్టిన దడిలోకి సమయం చూసి దూరాడు. అక్కడ ఒక గారె తీసుకుని అతడు తినబోతూండగా, అటువైపు ఎవరో

సుంకర భాస్కరరావు



వస్తూ కనిపించారు. వెంటనే అతడు పక్కన వున్న ఒక పెద్ద అండా వెనక్కు చేరి ఒదిగి కూర్చున్నాడు.

ఎఱ్ఱగా లావుగా వున్న ఒక మధ్యవయస్కురాలు వంటశాలలోకి వచ్చింది. ఆమె కాస్త కంగారుగా వున్నట్టు కుచేలయ్యకు కనిపించింది. ఇంతలో దడి అవతలి నుంచి ఎవరో, "గుండమ్మా! వచ్చేటప్పుడు గుత్తి వంకాయ కూర కూడా తీసుకురా!" అంటూ కేక వేశారు.

"అలాగే! అలాగే!" అంటూ గుండమ్మ వణుకుతున్న గొంతుతో జవాబిచ్చింది.

తర్వాత ఆమె తన దుస్తుల్లోంచి ఏదో వస్తువు తీసి, అటూ ఇటూ చూసి, పులుసు ఉడుకుతున్న పెద్ద అండాకేసి నడిచింది.

ఇదంతా చూస్తున్న కుచేలయ్య, "ఈవిడేదో వంటకాల్లో విషం కలపడం లేదు కదా!" అనుకున్నాడు. అంతలో అతడి చేతిలో వున్న గారె జారి కిందపడింది.

గుండమ్మ మరోసారి అన్నివైపులా చూసి, తన గుప్పెట్లో వున్న వస్తువును అండాలోకి జారవిడిచింది. ఆ సమయంలో కుచేలయ్య అది నాలుగు పేటల బంగారు గోవర్ధనం గొలుసని గుర్తుపట్టాడు.

అయితే, ఆవిడ ఆ గొలుసును కాగుతున్న పులుసులో ఎందుకు పడవేసిందో కుచేలయ్యకు అర్థం కాలేదు. అయితే, కడుపులో ఆకలి మంటల కారణంగా అతడు దాన్ని గురించి ఆలోచించే స్థితిలో లేడు.

కుచేలయ్య ఒక బుట్టలోంచి రెండు బూరెలు తీసుకుని నోట్లో పెట్టుకోబోతుండగా, ఎవరో అటుగా వచ్చి కుచేలయ్యను చూసి, "దొంగ! దొంగ!" అంటూ అరిచాడు.

మరుక్షణం కుచేలయ్య చేతిలోంచి బూరెలు కిందపడినై. అతడు లేచి పారిపోదామనుకునేంతలో నలుగురు పనివాళ్ళు అక్కడికి వచ్చి కుచేలయ్యను పట్టుకుని తీసుకుపోయి, ఇంటి యజమాని ముందు నిలబెట్టారు.

వాళ్ళు యజమానితో, "అయ్యా! రాత్రి దొంగను పట్టడం మహాసులువు, పగటి దొంగను పట్టడం మాత్రం మహాకష్టమంటారు. అయితేనేం — మేం ఎంతో చాకచక్యంగా వల వేసి, వీడు బూరెలు దొంగిలి

స్తుండగా పట్టేశాం. పెళ్ళి సందడిలో రకరకాల దొంగలు కాచుకుని వుంటారు. వీడు మహా ప్రమాదమైన దొంగలా వున్నాడు," అన్నారు.

యజమాని పరిహాసంగా నవ్వి, "మీరంతగా చెప్పనవసరం లేదు. వీడు పెళ్ళిదొంగ అన్నమాట!" అన్నాడు.

తనను యజమాని దొంగ అన్నందుకు కుచేలయ్య కోపంతో వణికిపోతూ, "అయ్యా! నేను దొంగను కాను. నలుగురు పిల్లలకు తండ్రిగా, చేసేందుకు పనిలేక, ఆకలితో అలమటిస్తున్న ఒక దరిద్రుణ్ణి. నేనీ నాటి వరకూ ఆకలిని జయించాననుకునేవాడిని. ఇప్పుడు ఆకలి నన్ను జయించి, మీ వంటశాలలోకి పంపింది. అసలైన దొంగ నా ఆకలి!" అన్నాడు.

ఇంటి యజమాని, కుచేలయ్యకేసి వినోదంగా చూస్తూ, "నేరానికి శిక్ష పడవసిందే కదా! నేరం నువ్వు చేసినా, నీ ఆకలి చేసినా ఒకటే," అన్నాడు.

తర్వాత ఆయన, పనివాళ్ళతో, ఇతణ్ణి నా గదిలోకి తీసుకురండి!" అని చెప్పి బయలుదేరాడు.

పనివాళ్ళు కుచేలయ్యను యజమాని గదికి తీసుకుపోయారు. అక్కడే భోజనాల బల్ల ముందు తను కూర్చుని, కుచేలయ్యను ఎదురుగా కూర్చోమని, అతడికి పనివాళ్ళ చేత రకరకాల వంటకాలతో భోజనం పెట్టించాడు. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరుగుతూండగా, కుచేలయ్య కడుపు నిండా భోజనం చేశాడు. "నీకు భోజనం ఎందుకు పెట్టానో తెలుసా?" అని అడిగాడు ఇంటి యజమాని.



తెలియదన్నట్టు తల అడ్డంగా వూపాడు కుచేలయ్య.

"అన్నం పరబ్రహ్మ స్వరూపం అన్న మాట వినే వుంటావు! లోకంలో దాన్ని దొంగిలించి తినవలసిన దుస్థితి ఏ మనిషికీ రాకూడదు. నిన్ను చూస్తే రాటుతేలిన దొంగలా లేవు; చదువుసంధ్యలున్నవాడిలా కనిపిస్తున్నావు. దొంగతనం చెయ్యవలసిన పరిస్థితి నీకెలా కలిగింది?" అని అడిగాడు ఇంటి యజమాని.

అప్పుడు కుచేలయ్య, తన తండ్రి వ్యాపారంలో తిరిగి కోలుకోలేనంతగా నష్టపోయి,

ఆ దిగులుతో చనిపోయిన సంగతీ, ఇప్పుడు తను భార్యాపిల్లల్ని పోషించలేక పడుతున్న ఇక్కట్ల గురించీ ఇంటి యజమానికి వివరంగా చెప్పాడు.

అంతా విన్న యజమాని పెద్దగా నిట్టూర్చి, "వ్యాపారం అంటే లాభాలే కాదు, నష్టాలు కూడా! సరే ఇప్పుడు పరిస్థితుల కారణంగా నువ్వు దొంగవయ్యావు, రేపు నీ పిల్లలు గజదొంగలయ్యే ప్రమాదముంది. ముందు నీ ఆకలి తీర్చాను. రేపు రా, నీకు ఉద్యోగం ఇస్తాను. నీ భార్యాపిల్లలకు భోజనం పట్టుకెళ్ళు," అన్నాడు.

వెంటనే కుచేలయ్య, ఆయన పాదాలంటి, "అయ్యా! మీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేనిది. నాకు కడుపు నిండా భోజనం పెట్టారు, అదీ పెళ్ళి భోజనం. కాని వంటకాలెలా వున్నాయని తమరు నన్నడగలేదు!" అన్నాడు.

కుచేలయ్య ఇలా అనగానే ఇంటి యజమాని ఏదో అనుమానం కలిగినవాడిలా కనుబొమలు చిట్లించి, "నిజమే! వంటకాలెలా వున్నాయి?" అని అడిగాడు.

"అయ్యా! వంటలన్నీ చాలా బావున్నాయి. అయితే, ముఖ్యంగా బంగారం పులుసు మాత్రం అద్భుతం!" అన్నాడు.

"బంగారం పులుసా! చెప్పదలిచిందేమిటో వివరంగా చెప్పు," అన్నాడు యజమాని.

కుచేలయ్య అప్పుడు వంటశాలలో తను చూసింది చెప్పాడు. యజమాని స్వయంగా దగ్గరుండి అండాలోంచి బంగారు గొలుసు బయటికి తీయించాడు. అది పెళ్ళికూతురు నగ! ఆ నగను దొంగిలించిన పనిమనిషి గుండమ్మను గట్టిగా ప్రశ్నించేసరికి, ఆమె తన నేరాన్ని ఒప్పుకున్నది.

ఆకలికి తట్టుకోలేక బూరెలు దొంగిలించి తింటూ, తన పనివాళ్ళకు పట్టుబడి, అసలు పెళ్ళి దొంగనుపట్టి ఇచ్చినకుచేలయ్య మీద ఇంటి యజమానికి మరింత ఆదరాభిమానాలు కలిగినై.

ఆయన అన్న విధంగా కుచేలయ్యకు తనదగ్గర మంచి ఉద్యోగం ఇచ్చి, ఏనాడూ అతడూ, అతడి కుటుంబం కష్టాలపాలు కాకుండా ఆదుకున్నాడు.






# తండ్రి సలహా

గోవిందు అనేవాడికి చాలా బాధ్యతలున్నాయి. తండ్రిని పట్టిన అనారోగ్యం పోవాలంటే వైద్యం చేయించాలి. తల్లికి పట్టుబట్టలు కట్టాలని చాలాకాలంగా మనసు, అది తీర్చాలి. ఇద్దరు చెల్లెళ్ళకు పెళ్ళి చేయాలి. ఇల్లు పాడు పడిపోయింది, దాన్ని బాగుచేయించాలి.

ఇన్ని బాధ్యతలూ నెరవేర్చడానికి వాడికి వేరే ఆస్తి లేదు. బుర్రలో తెలివితేటలున్నా, లౌక్యం తెలియని మితిమీరిన మంచితనం వల్ల అవి రాణించడం లేదు. ఏమైనా, మంచివాడి తెలివితేటలు ఇతర్లకు సాయపడడానికే తప్ప స్వార్థానికి పనికిరావు కదా!

చాలామంది వాడికి ఎలాగో అలా డబ్బు సంపాదించమని సలహా ఇచ్చారు. తండ్రి మాత్రం, "నాయనా! ఎన్ని కష్టాలు పడినా మంచితనం మాత్రం విడిచిపెట్టకు. అసలైన సంతోషం మంచితనం వల్లనే కలుగుతుంది," అంటూండేవాడు.

ఉన్న ఊళ్ళో సంపాదన చాలడం లేదని ఒకరోజున గోవిందు పట్నం బయలుదేరాడు. దారిలో ఒక పెద్ద అడవి వుంది. అడవిలో కొంతదూరం నడిచాక అలసట పుట్టి వాడొక చెట్టుకింద విశ్రమించాడు.

ఆ చెట్టుమీద చాలా కాలంగా దయ్యమొకటి వుంటున్నది. తోడుగా ఎవరూ దొరక్క దానికి తోచడం లేదు. అది గోవిందును చూస్తూనే చప్పున కిందికురికింది. అది భయపడుతున్న గోవిందుకు ధైర్యం చెప్పి, వివరాలడిగి తెలుసుకుని, "నాకేమైనా మంచి కబుర్లు చెప్పు. నువ్వు పట్నం వెళ్ళక్కర లేకుండా ఇప్పుడే బోలెడు డబ్బిస్తాను," అన్నది.

గోవిందు ధైర్యం తెచ్చుకుని దయ్యానికి ఒక గజదొంగ కథ చెప్పాడు. అది ఉత్సాహంగా కథ విని, "నువ్విక్కడే నాకు తోడుగా వుండిపో. నీ మాట తీరూ, చెప్పిన కథ చాలా బావుంది," అంది.

"వసుంధర"

అందుకు గోవిందు, "తప్పకుండా అలాగే చేద్దును, కానీ నాకు బాధ్యతలు వుండిపోయాయి కదా!" అన్నాడు.

దయ్యం వాడికి సంచీ నిండుగా బంగారు నాణాలిచ్చి, "పోయి త్వరగా నీ బాధ్యతలు తీర్చుకురా, నాకు తోడుగా వుందువుగాని," అన్నది.

గోవిందు ఇంటికి తిరిగివెళ్ళి, తండ్రికి వైద్యం చేయించాడు. తల్లికి పట్టుచీర కొన్నాడు. ఇల్లు బాగుచేయించాడు. కొద్దిగా పొలం కొని పేదరైతుకొకడికి కౌలుకిచ్చాడు. ఆ తర్వాత వాడికి దయ్యం విషయం గుర్తుకొచ్చి అడవికి వెళ్ళాడు.

అక్కడ వాడు రెండు రోజులుండి, ఈసారి దయ్యానికి రాజుల, రాణుల కథలు చెప్పాడు. వాడున్నంతసేపూ దయ్యానికెంతో ఉత్సాహంగా వుంది. అయితే, వాడిక వెళ్ళిపోతాననగానే అది ఎంతో దిగులుగా ముఖం పెట్టి, "నువ్వు ఇక్కడ నాతోనే వుండిపోగూడదా?" అని అడిగింది.

దానికి గోవిందు, "ఇంకా నా చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేయాలి. అమ్మా నాన్నలకు శాశ్వతంగా సుఖపడే ఏర్పాట్లు చేయాలి. ఇక్కడే నీతో వుండిపోవడం ఎలా కుదురుతుంది?" అన్నాడు.

దయ్యం వాడికి ఇదివరకటికంటే రెట్టింపు బంగారాన్నిచ్చి, "సరే, నీ బాధ్యతలన్నీ వదిలించుకుని రా!" అని చెప్పింది.

గోవిందు ఇంటికి పోయి, మరింత పొలం కొన్నాడు. చెల్లెళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళు చేసి, వాళ్ళు



మంచివాళ్ళనీ, తన తల్లిదండ్రులను చాలా ప్రేమగా చూసుకుంటారనీ నమ్మకం కుదిరాక, వాడికి చాలా సంతోషం కలిగింది. ఇక వాడు దయ్యం కోరికను తీర్చవలసి వుంది!

గోవిందు దయ్యం విషయం బాగా ఆలోచించాడు. తను మనిషిగా వున్నంతకాలం మనసు తనవాళ్ళ కేసి లాగుతూంటుంది. కనక, తనూ దయ్యమైతే శాశ్వతంగా దానికి తోడుగా వుండవచ్చు. ఇప్పుడు తన కుటుంబానికి తన అవసరం లేదు. తనకెంతో ఉపకారం చేసిన దయ్యానికి సంతోషం కలిగించాలంటే, ఆత్మహత్య చేసుకుని దయ్యంగా మారడం ఒక్కటే మార్గం!

ఇలా ఆలోచించిన గోవిందు, ఊరి చివర నున్న కొండశిఖరం ఎక్కి అక్కడి నుంచికిందికి దూకి చావాలని నిర్ణయించుకున్నాడు. వెంటనే బయలుదేరాడు. అయితే, వాడు కొండశిఖరం చేరుకునేసరికి, అక్కడ ఒకఅందమైన అమ్మాయి కనిపించి ఆశ్చర్యపోయాడు.

ఆ అమ్మాయి పేరు సరళ. చిన్నప్పుడే తల్లి చనిపోతే, తండ్రి రెండో పెళ్ళి చేసుకున్నాడు. సవతితల్లినానాబాధలూపెడితేఎలాగో సహించింది. ఇప్పుడా సవతితల్లి డబ్బుకాశించిఒకరోగిష్టిముసలివాడికిచ్చి పెళ్ళిచేయాలనుకుంటున్నది. తండ్రి కిమ్మనడం లేదు. ఆత్మహత్య చేసుకోవాలని పొరుగూరునుంచి ఇక్కడకు వచ్చింది. ఇంతలో గోవిందు అక్కడికి రావడం జరిగింది.

ఇద్దరూ ఒకరి కథ ఒకరు చెప్పుకున్నాక సరళ, గోవిందుతో, "నువ్వు చాలా మంచి



వాడివి. దయ్యానికి బదులు నాకు సాయ పడితే, నువ్వూ నేనూ కూడా సంతోషంగా బ్రతకుతాం. నా మాట విని నన్ను పెళ్ళి చేసుకో!" అని కోరింది.

"నాకూ, నువ్వు నచ్చావు. కానీ దయ్యా నికి ప్రత్యుపకారం చెయ్యడం, నా కర్తవ్యం. అందువల్ల నేను చావక తప్పదు," అన్నాడు గోవిందు.

ఆ జవాబు విని సరళ కొంచెంసేపు ఆలో చించి, "చూడు, నువ్వు చాలా పుణ్యాత్ముడివి, మంచివాడివి. నీవంటివాడు చస్తే దయ్యం అవడు. స్వర్గానికి వెళతాడు. అప్పుడు దయ్యా నికి బొత్తిగా తోడుండదు. నా మాట విని నన్ను పెళ్ళి చేసుకో. మనమిద్దరం ఇప్పటిలాగే మనుషులుగానే వుంటూ, దయ్యం వున్న చెట్టు దగ్గర నివాసం ఏర్పరచు కుందాం. నువ్వు దయ్యానికి తోడు; నేను నీకు తోడు!" అన్నది.

ఆమె మాటలు గోవిందుకు న్యాయంగా తోచాయి. భూమ్యాకాశాల సాక్షిగా వాడు అప్పటికప్పుడామెను పెళ్ళిచేసుకుని, వెంటనే బయలుదేరి అడవిలో దయ్యముండే చెట్టు వద్దకు వెళ్ళాడు.

అప్పుడు వాళ్ళ ముందు దేవతా పురుషు డొకడు ప్రత్యక్షమై, "నేనొక శాపగ్రస్తుణ్ణి. అన్ని సుఖాలూ అనుభవించే అవకాశం వుండి కూడా, దయ్యాన్నయిన నాకు బుద్ధి పూర్వకంగా సాయపడేందుకు, త్యాగం చేయ దలచిన నీ కారణంగా, శాపవిముక్తి కలిగింది. మిమ్మల్ని దీవించడం కోసం ఇక్కడ కాచు కుని వున్నాను. ఇదే మీకు నా చివరి దర్శనం!" అంటూ వాళ్ళను దీవించి, ఇద్దరికీ చెరొక సంచి నిండుగా బంగారు నాణాలిచ్చి మాయ మయ్యాడు.

దయ్యం తనకు సాయం చేసినందుకు, తనూ దానికి సాయపడ్డానని గోవిందు చాలా ఆనందపడ్డాడు. తర్వాత వాడు బంగారాన్నీ, సరళనూ వెంటబెట్టుకుని సంతోషంగా తల్లి దండ్రుల వద్దకు వెళ్ళి, వాళ్ళ చేతుల మీదుగా సరళను వివాహం చేసుకుని, చాలాకాలం పదిమందికీ సాయపడుతూ సుఖంగా, తృప్తిగా జీవితం గడిపాడు.






శుక్రుడు తనను ముసలివాడు కమ్మని శపించగానే యయాతి భయపడి శుక్రుడి కాళ్ళావేళ్ళా పడి, "నన్ను శపించటం న్యాయం కాదు. శర్మిష్ఠ పుత్రభిక్ష వేడింది. ఆమె కోరిక తీర్చకపోతే నాకు భ్రూణహత్య చేసిన పాపం చుట్టుకుంటుంది. ఆ పాపభీతితో ఆమె కోర్కె తీర్చాను. అంతేగాని, దేవయానికి అన్యాయం చేసే ఉద్దేశం నాకు ఏ కోశానా లేదు," అన్నాడు.

"నా శాపం వ్యర్థం కావటం అన్నది ఎన్నటికీ జరగదు. అయితే, నువ్వింకా కొంతకాలం యౌవనం అనుభవించగోరినట్టయితే, నీ ముసలితనం ఎవరైనా యువకుడికిచ్చి, వాడి యౌవనం నువ్వు పుచ్చుకునేటందుకు అవకాశం ఇస్తాను," అన్నాడు శుక్రుడు.

తన ముసలితనం తీసుకుని యౌవనం ఇవ్వమని పరాయివాళ్ళను అడిగేకన్న తన కొడుకులనే అడిగి, అందుకు సమ్మతించే వాడికే తన అనంతరం రాజ్యాభిషేకం జరిగేటట్టు చేస్తే బాగుంటుందని యయాతి ఆలోచించాడు. ఆ మాటే శుక్రుడితో అన్నాడు. అందుకు ఆయన సమ్మతించాడు.

యయాతికి వెంటనే ముసలితనం వచ్చేసింది. తల వణికింది. కీళ్ళు పట్టు తప్పాయి. జుట్టు తెల్లగా నెరిసింది. ముఖమంతా ముడతలు పడింది. తీవ్రమైన ఉబ్బస రోగం పట్టుకున్నది. ఆ స్థితిలో ఆయన తన పెద్ద కొడుకైన యదువును దగ్గరికి పిలిచి, అతనికి తన శాపం గురించి చెప్పి, "నాయనా, కొంత కాలం నా ముసలితనం నువ్వు పుచ్చు



కుని, నీ యౌవనం నాకిస్తావా? ఆ తరవాత కొంత కాలం గడిచాక నీ యౌవనం నీకిచ్చి నా ముసలి తనం నేను తీసుకుంటాను," అన్నాడు.

యదువు ఈ ఏర్పాట్లకు ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు.

యయాతి మండిపడి, యదువుకూ, అతని సంతతి అయిన యాదవులకూ రాజ్యార్హత లేకుండా చేశాడు.

యదువు ఒక్కడే కాదు, యయాతి కొడుకులు మిగిలిన వాళ్ళు కూడా తండ్రి ముసలి తనాన్ని స్వీకరించటానికి ఒప్పుకోలేదు.

శర్మిష్ఠ కొడుకులలో చిన్నవాడైన పూరుడొక్కడే తండ్రి చేసే ఏర్పాటుకు సమ్మతించాడు. శుక్రుడి దయవల్ల యయాతి తన ముసలితనాన్ని పూరుడికిచ్చి, పూరుడి యౌవనాన్ని తాను పొంది, విశ్వాచి అనే అప్సరసను వెంటబెట్టుకుని అందమైన స్థలాలలో విహరించుతూ, యథేచ్ఛగా సుఖించాడు. ఇలా కొంతకాలం జరిగాక ఆయన తన ఆశలన్నిటినీ తీర్చుకుని పూరుడికి తన యౌవనాన్ని ఇచ్చి, ముసలివాడై, పూరుడికి రాజ్యాభిషేకం చేశాడు.

పూరుడికి పౌష్టీ, కౌసల్యా అని ఇద్దరు భార్యలు. ఇద్దరికీ పుత్రులు జన్మించారు. కౌసల్యకు పుట్టిన కొడుకుల సంతతిలో, జనమేజయుడనేవాడి పరంపరలో పదహారో తరం వాడుగా దుష్యంతుడనేవాడు పుట్టాడు. దుష్యంతుడికీ, విశ్వామిత్రుడి కుమార్తె అయిన శకుంతలకూ భరతుడనే అతి చక్కని కొడుకు కలిగాడు.

విశ్వామిత్రుడికి కుమార్తె ఎలా కలిగిందంటే —

ఒకప్పుడు విశ్వామిత్రుడు అతి తీక్షణమైన తపస్సు చేశాడు. ఆ తపస్సు చూసి ఇంద్రుడు భయపడి, మేనక అనే అప్సరసను పిలిచి, "విశ్వామిత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. ఆ తపస్సు పూర్తి అయితే దేవతలకు అపాయం కలుగుతుందని నాకు భయంగా ఉన్నది. అందుచేత నువ్వు వెళ్ళి, నీ చాతుర్యమంతా వినియోగించి విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యి," అన్నాడు.



విశ్వామిత్రుడు సామాన్యుడు కాదు. ఆయన రాజవంశంలో పుట్టి, తన అద్భుతమైన తపశ్శక్తిచేత బ్రాహ్మణుడయ్యాడు. మహా ముక్కోపి, వశిష్ఠుడంతటివాడికే పుత్రశోకం కలిగించాడు. శాపంచేత చండాలుడై పోయిన త్రిశంకు చేత ఆయన యజ్ఞం చేయిస్తే, ఆయనకు భయపడి ఇంద్రుడే వెళ్ళి హవిర్భాగం పుచ్చుకున్నాడు. ఆ త్రిశంకుణ్ణే విశ్వామిత్రుడు తన శక్తిచేత స్వర్గానికి పంపి, దేవతలు తోసెయ్యగా కింద పడిపోతున్న త్రిశంకుడికి అంతరిక్షంలో ఒక వింత స్వర్గం సృష్టించి అందులో త్రిశంకుణ్ణి నిలిపాడు. ఇదంతా తెలిసి కూడా మేనక విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యటానికి బయలుదేరి విశ్వామిత్రుడున్న ఆశ్రమానికి వచ్చింది.

మేనక విశ్వామిత్రుడికి కనబడి నమస్కారంచేసి, ఆ ఆశ్రమంలో హాయిగా విహరించసాగింది. మెల్లమెల్లగా వీచే పిల్లగాలుల మధ్య అందంగా తిరుగుతున్న మేనకను చూడగా చూడగా, ఆమె చక్కని రూపురేఖలకు, అందానికి విశ్వామిత్రుడి మనస్సు చెదిరి పోయింది. ఆయనలో కలిగిన వికారాన్ని గమనించి మేనక తాను వచ్చిన పని నెరవేరుతున్నదనుకుని, ఆయనకు వశురాలయింది. వారి దాంపత్య ఫలితంగా మేనకకు ఒక అందమైన కూతురు పుట్టింది. ఆ పసిగుడ్డును మాలినీ నదీతీరాన నిర్జనారణ్యం మధ్య ఉంచి, తన మానాన తాను దేవలోకానికి మేనక తిరిగి వెళ్ళిపోయింది.

క్రూర మృగాలు స్వేచ్ఛగా తిరిగే అప్రాంతంలో ఆ పసిబిడ్డను శకుంత పక్షులు తమ రెక్కలతో కప్పి కాపాడాయి. మధ్యాహ్నం వేళ కణ్వమహాముని స్నానం చెయ్యటానికి వచ్చి, శకుంత పక్షుల రెక్కల నీడన సురక్షితంగా ఉన్న ఆ బిడ్డను చూసి, చుట్టుపక్కల ఆ బిడ్డ తాలూకు మనుషులెవ్వరూ లేకపోవటం చేత, ఆ బిడ్డను దగ్గిరలోనే ఉన్న తన ఆశ్రమానికి తీసుకుపోయి, శకుంతల అని పేరు పెట్టి, తన కూతురిలాగే భావించి పెంచనారంభించాడు.

శకుంతల కూడా నానాటికీ పెరుగుతూ, కణ్వమహామునినే తన తండ్రిగా భావించి, ఆశ్రమంలో పనులన్నీ చేస్తూ వస్తున్నది.



ఒకనాడు దుష్యంతుడు మాలినీ నదీ తీరానికి సపరివారంగా వేటకు వచ్చి, అక్కడ కణ్వమహాముని ఆశ్రమాన్ని చూశాడు. అది చాలా గొప్ప ఆశ్రమంగా అతనికి తోచింది. మునికుమారులు వేదపఠనం చేస్తున్నారు. కొందరు అగ్నిలో హవిస్సులు వేల్చుతున్నారు. ఒకచోట అధ్యయనమూ, చర్చా జరుగుతున్నది. సామగానం శ్రావ్యంగా వినిపిస్తున్నది.

దుష్యంతుడు తన పరివారాన్ని అక్కడే ఆగమని చెప్పి, తాను ఒక్కడే ఆశ్రమం ప్రవేశించి కణ్వుడి కుటీరానికి వచ్చాడు. ఆ సమయంలో కుటీరంలో కణ్వుడు లేడు. లోపల ఎవరని దుష్యంతుడు గట్టిగా పిలిచేసరికి, తాపస స్త్రీ వేషంలో ఉన్న శకుంతల లోపలి నుంచి వచ్చింది. ఆమె దుష్యంతుణ్ణి చూస్తూనే రాజని గ్రహించి, అతనికి అర్ఘ్యపాద్యాలిచ్చి, అతిథి సత్కారాలు చేసి, "మీకేం కావాలి?" అని అడిగింది.

ఎంతో అందంగానూ, సుకుమారంగానూ ఉన్న శకుంతలను చూసి, దుష్యంతుడు ఆమె అతిథి మర్యాదకు చాలా ఆశ్చర్యపడుతూ, "అమ్మాయీ, నేనిక్కడ అరణ్యంలో వేటాడ వచ్చి, కణ్వమహాముని దర్శనం చేసుకుని పోదామనుకున్నాను. ఆయన కుటీరంలో లేరా? ఎటు వెళ్ళారు?" అని అడిగాడు.

"ఆయన నా తండ్రి. ఫలాలూ, సమిధలూ తీసుకు రావటానికి వెళ్ళారు. ఒక్క క్షణం ఆగితే వచ్చేస్తారు," అన్నది శకుంతల.

శకుంతల మాట్లాడే సొంపు చూస్తున్న కొద్దీ దుష్యంతుడికి ఆమె మీద అభిమానం జాస్తి కాసాగింది. ఆమె కన్య అని తెలుస్తూనే ఉన్నది. అతను శకుంతలతో, "కణ్వమహాముని బ్రహ్మచర్య వ్రతం పూనిన వాడని విన్నాను. ఆయన నీకు తండ్రి ఎలా అయ్యాడు? అసలు నువ్వెవరి బిడ్డవు? ఈ ఆశ్రమంలోకి ఎలా వచ్చావు? నిన్ను చూసిన మాత్రం చేతనే నా మనసు నీకేసి ఆకర్షించబడుతున్నది. నిజం సంగతి చెప్పు," అన్నాడు.

తన జన్మవృత్తాంతాన్ని శకుంతల అదివరకే, కణ్వమహాముని మరొక మునికి చెప్తుండగా విని ఉన్నది కావటంచేత, దుష్యంతుడికి చెప్పేసింది.

"అయితే, నువ్వు రాజకన్యవేనన్న మాట. ఇంత చక్కని దానివి, ఇంత సుగుణవతివి, ఇలా నారబట్టలు కట్టి, అడవిపళ్ళు తింటూ ఈ ఆశ్రమ కుటీరంలో నివసించటం నాకేమీ నచ్చలేదు. నాకు భార్యవై నా రాజభవనంలో సమస్త సుఖాలూ హాయిగా అనుభవించు. నా రాజ్యానికి నువ్వే రాణివిగా ఉండు," అన్నాడు దుష్యంతుడు.

"అడవికి వెళ్ళిన మా నాన్నగారు రాగానే ఆయన అనుమతి పొంది, మీరు నన్ను పెళ్ళాడండి," అని శకుంతల సిగ్గుతో తల వంచుకున్నది.

తనకు భార్య కావాలని ఆమెకు కోరిక ఉన్నట్టు దుష్యంతుడికి స్పష్టమయింది. అతను శకుంతలతో, "చూడు, నా మనస్సు నీకోసం పరితపిస్తున్నది. గాంధర్వ వివాహం క్షత్రియులకు చెల్లుతుంది. గాంధర్వ వివాహానికి మంత్ర తంత్రాలు అవసరం లేదు. వధూవరుల ఇష్టమే తప్ప పైవాళ్ళ అనుమతి అవసరం లేదు. అది రహస్య వివాహం," అన్నాడు.

తనకు అతనివల్ల కొడుకు పుట్టే పక్షంలో ఆ కొడుకును దుష్యంతుడు యువరాజును చేసే షరతు మీద శకుంతల అతనితో గాంధర్వ వివాహానికి ఒప్పుకున్నది. వారిద్దరూ అప్పుడే భార్యాభర్తలయ్యారు. దుష్యంతుడు శకుంతలకు వీడ్కోలు చెప్పి, వెళ్ళిపోతూ, "నేను మా నగరానికి వెళ్ళి, నిన్ను తీసుకు రావటానికి మనుషులను పంపుతాను," అని శకుంతలకు నచ్చచెప్పాడు.





ఈ సంగతి కణ్వమహామునికి తెలిస్తే ఆయన కోపించి ఏం చేస్తాడోనని దుష్యం తుడికి మనసులో భయంగానే ఉన్నది.

శకుంతలకు కూడా అలాటి భయమే ఉన్నది.

తరవాత కణ్వమహాముని కందమూల ఫలాలు తెచ్చి పడేసి, కాళ్ళూ, చేతులూ కడుక్కుని వచ్చి కూర్చున్నాడు. శకుంతల సిగ్గుపడుతూ, భయపడుతూ వచ్చి దగ్గిర నిలబడింది.

ఆయన దివ్యదృష్టితో జరిగినది గ్రహించి, "అమ్మా, నువ్వు తగిన భర్తనే పెళ్ళాడావు. ఈ గాంధర్వ వివాహం ఫలితంగా నీకు మహాచక్రవర్తి కాదగిన కొడుకు పుడతాడు. నీకేమన్నా కోరిక ఉంటే చెప్పు," అన్నాడు.

"నాకు పుట్టబోయే కొడుకు దీర్ఘాయురైశ్వర్య బలాలు కలవాడే గాక, వంశకర్తగా కూడా ఉండాలని నా కోరిక," అన్నది శకుంతల.

అలాగే అవుతుందన్నాడు కణ్వుడు. శకుంతల మనస్సు ఊరట చెందింది.

కాలక్రమాన శకుంతల ఒక కొడుకును కన్నది. కణ్వ మహాముని ఆ కుర్రవాడికి శాస్త్రోక్తంగానూ, క్షత్రియోచితంగానూ జాతకర్మ మొదలైనవి చేశాడు. ఆ కుర్రవాడు శుక్ల పక్ష చంద్రుడిలాగా పెరుగుతూ, ఆరేళ్ళు వచ్చేసరికే సింహాలనూ, పులులనూ, ఏనుగులనూ ఎక్కి తిరగటమూ, వాటిని ఆశ్రమంలో ఉండే చెట్లకు కట్టెయ్యటమూ మొదలైన పనులు చేసి, ఆశ్రమంలో ఉండే మునులను హడలగొట్టసాగాడు. వాణ్ణి ముని ఆశ్రమంలో అందరూ ఆప్యాయంగా సర్వదమనుడని పిలిచేవారు.

ఒకనాడు కణ్వమహాముని శకుంతలతో, "అమ్మా, నీ కొడుకు ఇప్పుడే యువరాజు కాదగినట్టుగా ఉన్నాడు. వాడు వాడి తండ్రి దగ్గిర ఉండటం మంచిది. నువ్వయినా, భర్త ఉండగా ఎంత కాలమని పుట్టింట ఉంటావు? నిన్ను నీ భర్త వద్దకు పంపుతాను," అన్నాడు.

కణ్వుడి శిష్యులు కొందరు శకుంతలనూ ఆమె కొడుకునూ వెంటబెట్టుకుని దుష్యంతుడి నగరానికి వెళ్ళి, వదిలిపెట్టి,

ఆమెవద్ద అనుమతి పొంది ఆశ్రమానికి తిరిగివెళ్ళారు.

ద్వారపాలకుడు శకుంతలనూ, ఆమె కొడుకునూ ఆటంకపరచకుండా దుష్యంతుడి వద్దకు వెళ్ళనిచ్చాడు.

కాని శకుంతలను చూసి దుష్యంతుడు గుర్తుపట్టినట్టు కనిపించలేదు. శకుంతలకు గుండెలో గుబులు పుట్టుకొచ్చింది. ఆమె అతనితో, "రాజా, నువ్వొకసారి వేటాడుతూ కణ్వాశ్రమానికి వచ్చిన మాట మరిచావా? వీడు నీ కొడుకు. వీణ్ణి యువరాజు చేస్తానని ఆరోజు నాకు మాట ఇచ్చావు. నన్ను వశ పరచుకోవటానికి ఇచ్చిన మాటను మీర వద్దు," అన్నది.

దుష్యంతుడు అంతా ఎరిగి ఉండి కూడా, ఎరగనట్టు నటిస్తూ, "దుర్మార్గురాలా, అసలు నువ్వెవరు? నిన్ను నేనెరగను. అసం దర్భాలు మాట్లాడక, వచ్చిన దారే వెళ్ళు," అన్నాడు.

శకుంతలకు దుఃఖంతోబాటు కోపం కూడా వచ్చింది. ఆమె దుష్యంతుడితో, "రాజా, నీకేమీ తెలియదంటావా? ఇతరులెరు గరు గదా అని అబద్ధమాడతావా? జరిగిన దానికి నువ్వే సాక్షివి. నీ అంతరాత్మ సాక్షి. నిజాన్ని కప్పి పుచ్చటం మహాపాతకం. ఏ సద్బుద్ధితో ఆనాడు నన్ను నీదాన్ని చేసుకు న్నావో, ఆ సద్బుద్ధితోనే ఇవాళ నన్ను ఏలుకో. పశుపక్ష్యాదులు కూడా తమ సంతానాన్ని ప్రేమిస్తాయి. వీడు నీ కొడుకు. కన్నకొడు కును కాదనకు," అన్నది.

అప్పటికీ దుష్యంతుడి వైఖరిలో మార్పు రాలేదు.

ఆ సమయంలో ఆకాశం నుంచి అశరీర వాణి ఇలా అన్నది: "రాజా, ఈ పిల్లవాడు నీకు శకుంతలయందు పుట్టినవాడు. ఈ కొడుకును ప్రేమతో భరించు. వాడు భరతు డని పేరుపొందుతాడు."

దుష్యంతుడి భయం తీరిపోయింది. శకుంతల తన భార్యేననీ, ఆమె కుమారుడు తన కుమారుడేననీ లోకానికి వెల్లడయింది. అందుచేత అతను ధైర్యంగా వారిని చేర దీశాడు.







# అక్కాచెల్లెళ్ళు

వరలక్ష్మి, ధనలక్ష్మి అక్కచెల్లెళ్ళే అయినా, వయసులో ఆట్టే తేడా లేకపోవడంతో స్నేహితుల్లా మసిలేవారు. కానీ, కాస్త చిన్నదైన ధనలక్ష్మికి అసూయ, అసహనం, అహంకారం ఎక్కువ.

ఇద్దరిలోకీ ధనలక్ష్మి ఎక్కువగా అందంగా వుండేది. ఆమెను చూసి ఒక భాగ్యవంతుల కుమారుడు ముచ్చటపడి పెళ్ళి చేసుకుంటానన్నాడు. పెద్దపిల్లకు పెళ్ళి చేయకుండా చిన్నదానికెలా చేస్తానని, వాళ్ళ తండ్రి కంగారుపడి అప్పటికప్పుడు వరలక్ష్మికి కూడా ఒక సంబంధంస్థిరపరిచాడు.

వరలక్ష్మి భర్త, ఆస్తిపరుడు కాదు కానీ పట్నంలో రాజుగారి కొలువులో ఉంటున్నాడు. మరీ అంత అందగాడు కాకపోయినా కురూపి కాడు.

అక్కచెల్లెళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళయ్యాయి, కాపురాలకు వెళ్ళారు. తానెంత సుఖంగా వున్నప్పటికీ ధనలక్ష్మి, అక్క కాపురం గురించే వాకబు చేస్తుండేది. అక్క చాలా సంతోషంగా వుంటున్నదని తెలిసి అసూయపడి తరచుగా భర్తతో, "మనమెంతో భాగ్యవంతులం. అయినా, నా అక్క కాపురం నా కాపురం కంటే బాగుందని అంతా అంటున్నారు," అనడం మొదలు పెట్టింది.

అలాంటి సమయాల్లో ధనలక్ష్మి భర్త, "నీకు తోడబుట్టిన అక్క కదా! ఆమె సంతోషంగా వుంటే నీకు సంతోషం కాదా?" అనేవాడు.

ఒకసారి, వరలక్ష్మి కాపురంలోని ప్రత్యేకత ఏమిటో ప్రత్యక్షంగా చూసి తెలుసుకుందామని ధనలక్ష్మి భర్త, భార్యతో బయల్దేరి వెళ్ళాడు వాళ్ళింటికి.

వాళ్ళ ఇల్లు చిన్నది. ఇంట్లో ఖరీదైన వస్తువు ఏమీ లేదు. పనిమనుషులు లేరు. అన్నివిధాలా తమకంటే తక్కువగా వున్నవాళ్ళు, అంత సంతోషంగా ఎలా వుంటున్నారు అన్నది

జొన్నలగడ్డ రామలక్ష్మి



"నాకూ పురాణాలు చెప్పాలనే వుంటుంది. కానీ తీరుబడి దొరకదు. రోజూ నా ఇంటి చుట్టూ వ్యాపార సంబంధమైన విషయాల్లో సలహాల కోసం ఎందరో తిరుగుతూంటారు. నా సలహాల వల్ల వాళ్ళకు నెలకు లక్షల వరహాల లాభాలుంటవి మరి! పురాణజ్ఞానం చదివితే అబ్బుతుంది. వ్యాపార జ్ఞానం పుట్టుకతో రావాలికదా!" అన్నాడు ధనలక్ష్మి భర్త.

అంతా అవునంటూ మెచ్చుకున్నారు. కొందరు అతడిని సలహాలు కూడా అడిగారు. వరలక్ష్మి భర్త కూడా, "పనీపాటా లేని వాళ్ళకే పురాణాలు. మా తోడల్లుడికి ప్రతిక్షణం ఎంతో విలువైనది!" అని తోడల్లుణ్ణి మెచ్చుకున్నాడు.

ధనలక్ష్మికీ, ఆమె భర్తకూ కూడా విచిత్రంగా తోచింది.

వరలక్ష్మి భర్త సాయంకాలం పురాణం చదివి అర్థం వివరిస్తూంటాడు. అది వినడానికి చాలామంది వస్తూంటారు. వాళ్ళంతా అతడిని తెగ మెచ్చుకుంటుంటారు. ఆ దంపతుల సంతోషానికి అదొక కారణమని ధనలక్ష్మి అనుమానించి భర్తకు చెప్పింది.

మర్నాడు సాయంత్రం వరలక్ష్మి భర్త పురాణం చదువుతూంటే, దానికి ధనలక్ష్మి భర్త, కొత్త కొత్త అర్థాలు చెప్పాడు. అతడి పురాణ జ్ఞానానికి వచ్చిన వాళ్ళంతా ఎంతో ఆశ్చర్యపడి, "అయ్యా! తమ ఊళ్ళో తమరూ పురాణాలు చెబుతూంటారా?" అని అడిగారు.

వరలక్ష్మి వద్ద పాతకాలపు దేవతావిగ్రహం ఒకటి వున్నది. ఒకరోజున పెరట్లో గొయ్యి తవ్వుతుంటే అదామెకు దొరికింది. ఆ విగ్రహంచూడ్డానికెంతో అద్భుతంగా వుంటుంది. దాన్ని ఎంతైనా ధర ఇచ్చి కొంటామని చాలా మంది అడిగారు. వరలక్ష్మి అమ్మలేదు. ఆ విగ్రహాన్ని చూడ్డానికి ఎందరో వచ్చి వెళుతూంటారు. ఆ కారణంగా వరలక్ష్మి గర్వపడుతున్నదని ధనలక్ష్మి అనుమానించింది.

నాలుగు రోజులు అక్కడ వుండి తిరిగి వెళ్ళేటప్పుడు, అక్కా బావల్ని తమ ఇంటికి రమ్మని ధనలక్ష్మి మరీ మరీ ఆహ్వానించింది. ఆమె భర్త కూడా ఒకటికి రెండుసార్లు రమ్మని కోరాడు.

వరలక్ష్మి ఇందుకు సరేనని చెప్పి, "చెల్లీ! వెళ్ళేటప్పుడు నీకేమైనా ఇవ్వాలనుంది. నీ తాహతుకుసరిపడ్డవినేనెలాగూఇవ్వలేను. నే నిచ్చే బట్టలు నువ్వు కట్టవని నా అనుమానం. నా తాహతుకు మించని, నీకు తృప్తినిచ్చేదీ నావద్ద ఏమైనా వుంటే అడుగు. సంతోషంగా ఇస్తాను," అన్నది.

ధనలక్ష్మి మారాలోచన లేకుండా తనకు దేవతా విగ్రహం కావాలన్నది. వరలక్ష్మి దానిని ఇచ్చేసింది.

తిరిగి తమ ఊరు చేరుకున్నాక ధనలక్ష్మి భర్త ఆమెతో, "నువ్వు వాళ్ళ నుంచి దేవతా విగ్రహం ఎందుకు తీసుకున్నావు? అలా తీసుకున్నందువల్ల ఇప్పుడు నీ అక్కది పైచేయి అయింది కదా!" అన్నాడు.

ధనలక్ష్మి నవ్వి, "నా దగ్గరున్న వస్తువు ఇంకొకరి వద్ద వుండకూడదన్నది, నా పట్టుదల. ఈ అపురూపమైన దేవతావిగ్రహాన్ని అక్కకు లేకుండా చేశాను. ఇలాంటిదిప్పుడు నాదగ్గర తప్ప ఇంకెవరి వద్దా లేదు. అందువల్ల అక్కది పైచేయి ఎలా అవుతుంది? ఈ విగ్రహాన్నిఅక్క ఇచ్చినట్టుఎవరికీ చెప్పను గదా!" అన్నది.

కొన్నాళ్ళ తర్వాత వరలక్ష్మి, ఆమె భర్త ధనలక్ష్మి ఇంటికి వచ్చారు. వాళ్ళకు తన వైభవాన్నంతా చూపి ఎంతో గర్వపడింది, ధనలక్ష్మి. తన చెల్లెలు అంత వైభవంగా జీవిస్తున్నదని వరలక్ష్మి చాలా సంతోషించింది. అయితే,



అదంతా నటన అనీ, అక్క మనసులో బాధ పడుతున్నదనీ ధనలక్ష్మి అనుకున్నది.

వరలక్ష్మి తిరుగు ప్రయాణమై వెళ్ళేరోజు వచ్చింది. ఆ రోజున వర్తకుడొకడు వాళ్ళింటికి వచ్చి, "ఇంతవరకూ ఎక్కడా దొరకని అపురూపమైన ముత్యాలు రెండే రెండు నా దగ్గర వున్నవి. ఒక్కొక్కటి పదివేల వరహాలు. మీరొకటి తీసుకుంటే మరొకటి ఏ మహారాజుకో అమ్ముతాను," అన్నాడు.

ధనలక్ష్మి ఆ ముత్యాలను చూసి ముచ్చటపడి, "ఇలాంటివి మరెక్కడా లేని పక్షంలో రెండింటినీ నేనే తీసుకుంటాను," అన్నది.

ఇందుకు వర్తకుడు ఆశ్చర్యపడి, "రెండేం చేసుకుంటారమ్మా? హారంలో పొదగడానికి



ఒక ముత్యం చాలు గదా! మరొక ముత్యాన్ని ఏ హారంలో పొదుగుతారు? నాదగ్గర అపురూప మైన మరకతాలు పన్నెండున్నాయి," అన్నాడు.

ధనలక్ష్మి తల అడ్డంగా ఊపి, "పన్నెండు నేనేం చేసుకుంటాను? నేనొక ముత్యం కొంటే, అలాంటిదే ఇంకొకళ్ళు కొనడం నాకు నచ్చదు!" అన్నది. వర్తకుడు మారుమాట్లాడకుండా రెండు ముత్యాలూ ధనలక్ష్మికిచ్చి, డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు. వరలక్ష్మి తిరిగి తన ఊరు వెళ్ళే రోజున, ధనలక్ష్మి ఆమెకు కాస్త చౌకలో చీరకొని ఇచ్చింది.

ఆ తర్వాతనుంచి ధనలక్ష్మి సంతోషానికి అవధులు లేవు. తను అన్నివిధాలా అక్కకన్నా గొప్పదాని నన్న సంతృప్తి కలిగిందామెకు. తనతో సరిరాగలవారు లేరన్న తృప్తి, ఆత్మ వంచనా, పనీ పాటా లేకపోవడం, మితిమించిన జిహ్వాచాపల్యం – ఇలాంటివి కారణాలు కావచ్చు; ఏడాది తిరక్కుండానే ఆమె చాలా లావుగా అయిపోయింది. దాంతో ఆమె అందం చాలావరకు తగ్గింది.

"ఇప్పుడు నా అక్క చాలా సన్నంగా వుండి, నాకంటే అందంగా వుంటుంది!" అని తరచూ ధనలక్ష్మి బాధపడసాగింది.

తన లావు తగ్గించడానికి ధనలక్ష్మి, వైద్యుల్ని సంప్రతించింది. వాళ్ళామెను పరీక్షించి, "అమ్మా! ఇది ఊబకాయం. దీనివల్ల మీకు కీళ్ళనొప్పులు, గుండెపోటు, ఉబ్బసం వగైరా వ్యాధులెన్నో వచ్చే ప్రమాదముంది. కొంత కాలం పాటు మీరు తిండి బాగా తగ్గించాలి. ఎక్కువగా వ్యాయామం చేయాలి," అని చెప్పారు.

వైద్యుల సలహా పాటించాలనుకున్న ధనలక్ష్మి వ్యాయామం చేస్తే ఆయాసం రాసాగింది. తిండి తగ్గిస్తే నీరసం, ఇక తను బతికినంత కాలం ఊబకాయంతో లావుగా వుండిపోతానని బెంగపెట్టుకున్నది. అందువల్ల ఆమెకేదో జబ్బు చేసి మంచంపట్టి మనిషి కాస్త చిక్కింది.

ఈలోగా చెల్లెలు జబ్బు గురించి తెలిసి, చూడ్డానికి వచ్చింది వరలక్ష్మి. అక్కను చూడగానే ధనలక్ష్మి ముఖం ఇంతయింది. ఎందుకంటే, ఆమె ఇప్పుడు తనకంటే లావుగా వుంది. "అదేమిటి ఇంత లావుగా అయిపోయావు?" అని అడిగింది ధనలక్ష్మి పట్టరాని

సంతోషంతో. ఆమెకు ముఖంలో సంతోషం దాగడం లేదు.

చెల్లెలు తన యోగక్షేమాల గురించి తెలుసుకోక, లావు గురించి మాత్రమే సంతోషిస్తున్నందుకు వరలక్ష్మి కి మనసు చివుక్కుమన్నది. అయినా, ఆమె చెల్లెలి జబ్బు గురించి వివరాలడిగి తెలుసుకున్నది.

ధనలక్ష్మి లావుగా వున్న అక్కను చూసి సంతోషం కొద్దీ, ఆమెను బలవంతపెట్టి చాలా రోజులు తన ఇంట వుంచుకున్నది. క్రమంగా ఆమె జబ్బు చేత్తో తీసేసినట్టు మాయమైపోవడంతో, ఆమెకు మరికాస్త ఒళ్ళు వచ్చింది.

అప్పటికి వరలక్ష్మి భర్తకు, తన మరదలు ధనలక్ష్మి మనస్తత్వం గురించి పూర్తిగా అర్థమయింది. అతడు భార్యతో, "ఏమనుకోకు, లోగడే చెబుదామనుకున్నాను. నువ్వు సన్నగా వుంటే ఎంతో అందంగా వుంటావు. ప్రయత్నించి ఒళ్ళు తగ్గించుకో," అన్నాడు.

"అందం మాట దేవుడెరుగు! ఒళ్ళు తగ్గించుకునేందుకు నానాహైరానా పడాలి?" అన్నది వరలక్ష్మి సిగ్గుగా.

"నీ కోసం కాదు, నీ చెల్లెలి కోసం," అన్నాడు వరలక్ష్మి భర్త.

అతడు చెప్పేదేమీ అర్థం కాలేదన్నట్టు చూసింది, వరలక్ష్మి. అప్పుడామె భర్త, "నువ్వు లావుగా వున్నావని ఇప్పుడు నీ చెల్లెలు చాలా సంతోషిస్తున్నది. ఆమెది జబ్బు ఒళ్ళని నా అభిప్రాయం. తగ్గించుకోకపోతే రకరకాల కొత్త జబ్బులు వస్తాయి. నువ్వు ఒళ్ళు తగ్గించుకున్నావంటే, నీమీద పంతం కొద్దీ ఒళ్ళు తగ్గించుకునేందుకు శ్రద్ధగా ప్రయత్నిస్తుంది. నువ్వు ఆరోగ్యంగా వున్నా సరే, నీ చెల్లెలి ఆరోగ్యం కోసం నీఒళ్ళు తగ్గించుకోక తప్పదు," అన్నాడు.

అప్పటికి వరలక్ష్మి కి పరిస్థితి పూర్తిగా అర్థమయింది. ఆమె భర్త చెప్పినట్లే చేసింది. పంతంకొద్దీ ధనలక్ష్మి, అక్కలాగే తనూ తిండి తగ్గించీ, వ్యాయామం చేసీ తన ఒళ్ళు కూడా తగ్గించుకుని సన్నగా, నాజూకుగా తయారయింది.

విచిత్రమైన ఆ అక్కాచెల్లెళ్ళ అనుబంధం చాలాకాలం అదేవిధంగా కొనసాగింది.






## 3,000 సంవత్సరాల నాటి మనిషి కాయం

లక్షలాది సంవత్సరాల నాటి జంతువుల, పక్షుల శిలాజాలు అక్కడక్కడా బయటపడినట్టు అప్పుడప్పుడూ వార్తలు వస్తూఉంటాయి. ఇటీవల వాయవ్య ఇరాన్‌లోని ఉప్పుగనిలో ఒక మనిషి భౌతికకాయం బయటపడింది. కళ్ళూ, ముక్కూ, చెవులూ, మీసాలూ ఏవీ చెక్కుచెదరలేదు. శరీరానికి ఊలు దుస్తులూ, ఒక కాలికి బూటూ, ఎడమ చెవికి బంగారు పోగూ ఉన్నాయి. వేషధారణనుబట్టి చూస్తే అతడు ప్రాచీన బాబిలోనియన్ లేదా అస్సీరియన్ అయివుండవచ్చని భావిస్తున్నారు. ఆ మనిషి దాదాపు 3,000 సంవత్సరాలకు పూర్వం జీవించి వుండవచ్చని భూగర్భ శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఆ మనిషి కాయానికి దాపులలో లభించిన మట్టిపాత్రలు క్రీ.పూ. 1000 సంవత్సరాల నాటివని తెలియవచ్చింది.



## తప్పిన ప్రాణాపాయం

ఇంగ్లాండులోని కోల్‌చెస్టర్ నగరం మీదుగా టామ్ మోలోనీ, ఒక జెట్ విమానాన్ని నడుపుతున్నప్పుడు అది హఠాత్తుగా ఆకాశంలో తల్లకిందులు కావడంతో, పక్కనే కూర్చున్న అతని సోదరుడు విమానం నుంచి బయటికి తోయబడ్డాడు. ప్యారాచూట్ వేసుకోవడానికి కూడా సాధ్యంకాలేదు. అతడు 3,000 అడుగుల (915 మీ) ఎత్తు నుంచి కిందపడ్డాడు. చిన్న గాయాలు మాత్రం తగిలాయిగాని, అదృష్టవశాత్తు ప్రాణాలతో బయటపడ్డాడు. ఆదుర్దాతో విమానం నుంచి దిగిన సోదరుణ్ణి అతడు నవ్వుతూ పలకరించాడు!



## అతిపెద్ద బుద్ధ విగ్రహం!

ఇటీవల హాంకాంగ్ సమీపంలోని లాంటోవ్ దీవిలో 36 మీటర్ల ఎత్తయిన కాంస్య బుద్ధ విగ్రహ ప్రతిష్ఠాపన జరిగింది. దాదాపు 50,000 మంది భక్తుల ప్రార్థనల మధ్య వేకువజామున గవర్నర్ క్రిస్ పాటన్ విగ్రహాన్ని ఆవిష్కరించారు.




# సందేహాలు

పూర్వం, వింధ్యారణ్య ప్రాంతాలలో ఒక మునీ శ్వరుడు దైవధ్యానం చేసుకుంటూ ఉండే వాడు. గుహలో సాధువు ఉండటం లోకానికి క్రమంగా తెలిసింది. అప్పటి నుంచీ జనం గుంపులు గుంపులుగా కొండ మీదికి రావటం ప్రారంభించారు. వాళ్ళ వాళ్ళ మంచి చెడ్డలూ, కష్ట సుఖాలూ చెప్పుకుంటే వాళ్ళ మనసులో బాధ తగ్గేది. కాబట్టి జనం రోజూ వచ్చే వాళ్ళు. సాధువు చెప్పే మంచి మంచి సలహాలు వినగానేదిగులుతోవచ్చిన వాళ్ళుసంతోషంతో మళ్ళిపొయ్యేవాళ్ళు.

ఇలా లోకంలో బాధలన్నీ వినగా వినగా, సాధువు మనస్సులో సందేహాలు ఎక్కువ కాజొచ్చాయి.

"నేను చదివి నేర్చిన శాస్త్రాలు వేరు, ఇప్పటి జనవాక్యం వేరు. ఎంత ఆలోచించినా ఒక దాని కొకటి సంబంధమే కనబడదు. రోజు రోజుకూ ధర్మం నశిస్తూంది. అధర్మమే జయి స్తూంది. దేవుడూ దయ్యమూ, స్వర్గం - నరకం ఇవన్నీ వట్టి బూటకాలు. కనుక స్వయంగా పోయి లోకంలో నిజానిజాలు తెలుసుకుంటే గాని మనశ్శాంతి లేదు," అని అనుకుని, మళ్ళీ ఒకసారి లోకం చూసి రావటానికని గుహనుంచి బయలుదేరాడు.

జీవిత మంటే పూర్తిగా వైరాగ్యం కలిగి పోయిన సాధువు దండమూ, కమండలువూ చేత పుచ్చుకుని కొంత దూరం సాగేసరికి ముద్దులుమూటగట్టే పన్నెండేళ్ళ బాలుడు ఎదురయ్యాడు. సాధువునుచూడగానేబాలుడు చిన్నగా నవ్వాడు. సాధువూ, బాలుడూ కుశల ప్రశ్నలు వేసుకున్నాక, ఒకరితో ఒకరు మాటలు కలిపారు. ఇద్దరూ ఒకే చోటికి వెళుతున్నట్టు తేలింది.

తనకు తలవని తలంపుగా ఇటువంటి సావాసం దొరికినందుకు సాధువు చాలా సంతో షించాడు.



ఇవతలికి వచ్చేయగానే ఆ దివ్యభవనంలో కలవరం బయలుదేరింది — యజమానికి అత్యంత ప్రియమైన బంగారు గిన్నె కనిపించ లేదు!

గిన్నె కాజేసింది మరెవరో కాదు, అందరూ అనుమానించినట్టు బాలుడే! భోజనాల సందడిలో అతడు గిన్నె తీసి దాచి వెయ్యడం సాధువు గమనిస్తూనే వున్నాడు. తిన్న ఇంటి వాసాలే లెక్కపెట్టిన బాలుడి తుంటరిబుద్ధికి సాధువు మనస్సులో ఎంతోగానో బాధపడ్డాడు. కాని, "ఏమిట్రా అబ్బాయీ, ఈ పని?" అని పదిమందిలో ఎదటపడి మందలించ లేక పొయ్యాడు.

ఉభయులూ కలిసి పోగాపోగా, ఒక ఊరి పొలిమేరని చేరుకున్నారు. అక్కడ కొందరు సేవకులు వచ్చి వారికి ఘనమైన స్వాగత మిచ్చి, ఊరు మధ్యలో ఉన్న ఒక దివ్య భవ నానికి తీసుకుపోయారు.

ఆ ఇంటివారు వీరికి గొప్ప విందు చేశారు. బాలుణ్ణి చూసి చాలా ముచ్చటపడిన యజ మాని తనకు ప్రత్యేకం బహుమతిగా వచ్చిన ఒక బంగారు గిన్నెను బయటికి తీయించి, అందులో పిల్లవాడికి పాయసం వడ్డింపిం చాడు.

ఆ రాత్రికి అక్కడే అలసట తీర్చుకుని, ఉదయానే యజమాని వద్ద సెలవు తీసుకుని అతిథులు మళ్ళీ బయలుదేరారు. వారు

సాధువూ బాలుడూ సాగిపోతుండగా, ఆకస్మికంగా దారిలో కారు మబ్బుపట్టి కుండ పోతగా వర్షం కురిసింది. ఇద్దరూ పూర్తిగా తడిసిపోయారు. అల్లంత దూరంలో మినుకు మినుకుమని ఒక చిన్న వెలుగు కనిపించగా, ఉభయులూ మెల్లగా ఆ ఇంటి దగ్గరికి చేరు కున్నారు.

"ఎవరయ్యా, ధర్మాత్ములు! బాగా తడిసి పొయ్యాం. కాస్త పంచ కింద నించుంటాం, రెండు ప్రాణుల్ని రక్షించి పుణ్యం కట్టుకోం డయ్యా, బాబూ!" అంటూ బతిమలాడుతూ తలుపులు బాదారు.

కొంతసేపటికి విసుక్కుంటూ నవుకరు తలుపు తెరిచి, ఇద్దర్నీ యజమాని ఎదట పెట్టాడు.

"అర్ధరాత్రి వేళ ధర్మ మేమిటి, ఇలాంటి వాళ్ళని తీసుకువస్తావే నీకు బుద్ధి లేదా?" అని నవుకరును చివాట్లు వేశాడు పరమలోభి అయిన ఆ యజమాని. చివరికెలా అయి తేనేం, వాకిట్లో పారేసిన అంట్ల గిన్నెలు గీక్కు తినటానికి యజమాని అనుజ్ఞ ఇచ్చి, "వాన కాస్త వెలియగానే వాళ్ళను అవతలికి పంపిం చెయ్యి, నమ్మరాని కాలం," అంటూ తన నవుకరును గట్టిగా హెచ్చరించాడు.

అలానే, బాలుడు అంట్ల పాత్రల్లో అడుగున ఉన్న మెతుకులు సాధువుకు పెట్టి, తను పస్తున్నాడు. కొంతసేపటికి వాన తెరపిచ్చింది.

నవుకరు చెప్పకుండా అతిథులే వెళతా మని అతనితో అని, మళ్ళీ ప్రయాణం సాగించ బోయారు.

గుమ్మం దాటే ముందు బాలుడు తను దొంగిలించి తెచ్చిన ఆ బంగారపు గిన్నెను నవుకరుచేతిలోపెట్టి, "నాయనా!వేళగాని వేళ మాకుచోటిచ్చావు.ప్రాణాలునిలబెట్టావు,పైగా మీ యజమానితో చెప్పి భోజనం కూడా పెట్టిం చావు. మీ ఆదరణకు ఎన్ని జన్మలెత్తినా రుణం తీర్చుకోలేమన్న మాట. మీవంటి ధర్మా త్ములూ, దయామయులూ అక్కడక్కడ ఉండ బట్టే ప్రపంచ మింకా ఇట్లా నిలబడివుంది. ఇదుగో, ఏదో ఉడతాభక్తి! ఈ గిన్నెను తీసుకు పోయి, మీ యజమానికివ్వు," అని చెప్పాడు.

బాలుడు చేసిన పని సాధువుకు విడ్డూర మనిపించింది. పట్టరాని కోపం వచ్చింది. గట్టిగా బుద్ధి చెప్పాలనుకున్నాడు. కాని, నోరు తెరిచి పలకలేకపోయాడు.



బాలుడు, "తాతా! నీ కిదంతా మాయగా కనిపిస్తూంది కదూ? ఇది మాయనాటకమే, అందులో మనిద్దరమూ రెండు బొమ్మలం!" అంటూ నవ్వాడు.

"నువ్వేదో మంచి పిల్లవాడివనుకున్నాను. నీ సావాసం వల్ల నాకు కలిగిన సందేహాలు తీరతాయనుకున్నాను..." అంటూ సాధువు ఏదో బాధ అతడికి వెల్లడించబోయాడు.

అప్పుడు బాలుడు, "నీ సందేహాలు తీర్చ టానికే వచ్చాను," అంటూ, ఇలా చెప్పాడు: "అయితే విను — మనల్ని గొప్పగా ఆదరించి అతిథ్య మిచ్చిన యజమాని ఉన్నాడే, కీర్తి కోసం పటాటోపం చేసి, అప్పులపాలై, ఇల్లు గుల్ల చేసుకుంటున్నాడు. ఆయనకు ప్రాణ ప్రదమైన స్వర్ణపాత్ర కాస్తా కాజెయ్యటంతో కన్ను తెరిచి, ఇప్పుడు తగినట్టుగా మసులు కుంటున్నాడు. ఈ విధంగా అతడి పండు వంటి కాపరం పాడు కాకుండా చేశాను."

"బాగానే వుంది. మరైతే, అటువంటి పాత్రను పరమలోభి కివ్వడం అపాత్ర దానం కాదూ?" అన్నాడు సాధువు.

అందుకు బాలుడు, "అదే పొరపాటు. ఆ యజమానికి డబ్బు గడించటమే తెలుసు కాని, ఒకరికి ఇవ్వడమనేది తెలియదు. మన మిచ్చిన బంగారు గిన్నె వెళ్ళి వాడి మనస్సు మార్చివేసింది. 'నాలుగు ఎంగిలి మెతుకులు పెట్టినందుకే నా కిటువంటి బహుమతి దొరికిందే, కడుపునిండా భోజనం పెట్టితే ఇంకా ఎంత ఘనమైన బహుమానం దొరికి వుండేదో కదా!' అనుకున్నాడు. పుణ్య కార్యాల మీద ఆసక్తి కలిగింది. ఇప్పుడు విరివిగా దానధర్మాలు చేయడంవల్ల ఆతడు కూడబెట్టిన ఆస్తి అంతా లోకం మంచికోసం వినియోగ మవుతూంది," అని చెప్పాడు.

"నా సందేహాలన్నీ పూర్తిగా తీరి పోయాయి. ధన్యుణ్ణయ్యాను," అని సాధువు అనేటంతలో బాలుడి ముఖంలో ఒక మతాబీ వెలుగు వెలి గింది. విమానం దిగుతున్న శబ్దమైంది. బాలుడు మరి కనపడకుండా అంతర్థానమ య్యాడు.

నిండు సంతోషంతో సాధువు మళ్ళీ తన గుహలోకి మళ్ళిపొయ్యాడు.



## ప్రకృతి వింతలు :

### రంగు ఇచ్చే భద్రత!

పక్షులను పట్టి తినే జంతువులు, తల మీది కుచ్చూ, ఒంటిమీది ఈకలూ గాఢమైన రంగుతో వున్న లకుముకి పిట్టల వంటి వాటి జోలికి అంతగా పోవు. గాఢమైన రంగులు గల పక్షులు తినడానికి బావుండవనిఅవి భావిస్తాయి. కూకుడు గువ్వల వంటి పక్షుల ఈకల రంగు గాఢంగా వుండడమే కాకుండా వీటి శరీరం నుంచి దుర్వాసన వీస్తుంది. ఇవి గూళ్ళను శుభ్రంగా వుంచుకోవు. బయటికి వెళ్ళేప్పుడు కూడా ఇవి దుర్గంధంతో వుంటాయి. కాబట్టి వాటిని పట్టుకోవడానికి వచ్చే జంతువులు సమీపించడానికి వెనకాడతాయి.



### పెరూ నుంచి వచ్చిన దుంప

16వ శతాబ్దంలో దక్షిణ అమెరికాలోని పెరూ నుంచి, సర్ వాల్టర్ రాలీఘ్, బంగాళా దుంపను ఇంగ్లాండుకు తీసుకువెళ్ళాడు. కొన్ని సంవత్సరాల తరవాత అక్కడ కరువు వచ్చి, తినడానికి బంగాళా దుంపలు తప్ప మరేదీ మిగలలేదు. ఆ దుంప వల్లే తమకీ గడ్డురోజులు వచ్చాయని భావించి అప్పటి ప్రజలు దానిని తినడానికి విముఖత చూపారు. 17వ శతాబ్దంలో ఇంగ్లాండులో బంగాళా దుంపను పండించరాదని నిషేధించారు. దాదాపు ఒక శతాబ్దం తరవాత బవారియాకు వెళ్ళిన ఒక ఇంగ్లీషు కల్నల్ అక్కడి సైనికులకూ, శ్రామికులకూ బంగాళాదుంప ప్రధాన ఆహారంగా వుండడం చూశాడు. ఆ తరవాత అతడే దానిని ఇంగ్లాండులో ప్రవేశపెట్టి ప్రాచుర్యం కల్పించాడు. మన దేశంలో 1820 వ సం॥లో బంగాళాదుంపలను మొట్టమొదట నీలగిరి కొండలలో పండించారు.



### 'బంగారు' ఆకు

తమిళ ప్రాంతంలోని సిద్ధపురుషులు 'కల్ తామరై' అనే పువ్వును 'మహామూలిక' అని గొప్పగా కీర్తించారు. ఈ 'రాతి తామర' పువ్వు ఆకులు తామరాకుల్లాగా ఆకుపచ్చ రంగుతో ఉంటాయి. ఈ ఆకుపసరు చాలా బలవర్థకమైనదని చెప్పారు. ఈ ఆకులను నేల మీద పరచి, వాటి మీద నిలబడి పైకి చూస్తే పట్టపగలే చుక్కలు కనిపిస్తాయట! అంటే – అవి కళ్ళకు అంత మేలు చేస్తాయన్న మాట. అంతేకాదు. రాగి వంటి లోహాలను బంగారంగా మార్చే శక్తి కూడా ఈ ఆకుపసరుకు ఉన్నదని 'సిద్ధులు' చెప్పారు!




Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!








It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.



From all of us here at Chandamama, have a great year in school. And remember to tell us what you've learnt everyday, when you come home from school !






HANDAMAMA

OLLECTION

ARTIG1246

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.


S.R. Prasad


S.R. Prasad

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఆగస్టు నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **ఇంకెందుకు చిందులు?** రెండవ ఫోటో : **బతుకులే తలకిందులు!**

పంపినవారు : ఎన్. సుబ్రహ్మణ్యం S/o. భాస్కరరావు, పైడికొండ (పోస్టు)
తొండంగి (మండలం) తుని (తాలూకా) తూ.గో. జిల్లా (ఆం. ప్ర)
బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతిప్రియమైన కానుక

# చందమామ




వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 105.00 ఎయిర్‌మెయిల్ ద్వారా: రూ. 252.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 252.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని, మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

